*Issued on 8-10-1957*

VOL. V
No. 4



*22nd July, 1957*
*(Monday)*

# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES
# OFFICIAL REPORT

## Part II—PROCEEDINGS OTHER THAN QUESTIONS AND ANSWERS

---

CONTENTS



NOTE: *At the commencement of the speech denotes confirmation from the Member not received in time.

---

PRINTED BY AJANTA PRINTERS, SECUNDERABAD
FOR THE DIRECTOR, GOVERNMENT PRINTING PRESS
ANDHRA PRADESH, HYDERABAD.

1957

# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

*[Part II—Proceedings other than Questions and Answers]*

## OFFICIAL REPORT

---

*Thirty-sixth Day of the Fifth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Monday, the 22nd July,* 1957.

The House met at Half Past Eight of the Clock

*[ Mr. Speaker in the Chair ]*

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## ADJOURNMENT MOTION RE: CLOSURE OF MANGANESE MINES AT GARIVIDI

మిస్టర్ స్పీకర్ : మూడు విరామ తీర్మానాలు (adjournment motions) వచ్చాయి. రెండు 18 వ తారీఖున, ఒకటి 20 వ తారీఖున వచ్చాయి. 18 వ తారీఖున ఇచ్చినది శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, శ్రీ నాగిరెడ్డిగారు, శ్రీ వేమయ్యగారు ఇచ్చారు. శ్రీ సత్యనారాయణరాజుగారు 20 వ తారీఖున ఇచ్చారు. ఇదివారి నియోజకవర్గానికి సంబంధించిన విషయమే. విరామ తీర్మానము ఇట్లాఉన్నది : "గరివిడి మాంగనీసు గనులలో పనిచేస్తున్న 8 వేల మంది కార్మికులను ఈ నెల 6 వ తేదీనుంచి పనిలోనుంచి తొలగించి వారికి వృత్తి లేకుండా చేయ్యడంవల్ల కార్మికులలో అశాంతి ప్రబలి విపత్కరపరిస్థితులు ఏర్పడినందున ఈ సమావేశం వాయిదావేసి ఈ సమస్యను చర్చించాలని కోరుతున్నాను." ఇదే నాగిరెడ్డిగారు, వేమయ్యగారు ఇచ్చారు. దానిని గురించి ముఖ్యమంత్రిగారు ఏమైనా సంజాయిషీ చెబుతారా ?

ముఖ్యమంత్రి (శ్రీ ఎన్. సంజీవరెడ్డి) : సంజాయిషీ చెప్పడానికేమీ లేదు. వేగనులు లేకపోవడంవల్ల మూసివేస్తున్నామని వారు చెప్పారు. ప్రభుత్వం తరపున వాగన్లు ఎక్కువగా సప్లయిచేయాలని కేంద్రప్రభుత్వంవారిని కోరాము. వారుకూడా కృషిచేశారు. అయినా ఇంకా ఎక్కువగా వాగనులు రాలేదని వారు మూసినారు. అది మంచిదికాదని మేము సలహా ఇస్తున్నాము. త్వరలో అంగీకరించి పని ప్రారంభిస్తారని ఆశిస్తున్నాము. మేము చేయగలిగిన సహాయం చేస్తున్నాము. వెంటనే తెరువవలసిందని సలహాలు చెబుతున్నాము. ఇంతకు ఎక్కువగా రేపైనా ఎల్లుండైనా తెప్పించగలిగిందేమీలేదు.

మిస్టర్ స్పీకర్ : చేయగలిగిన సహాయం చేస్తున్నామని ముఖ్యమంత్రి గారు చెబుతున్నారు. కార్మికులయెడల సానుభూతి కనబరుస్తున్నారు. ఇంకా ఏమైనా కావాలంటే సత్యనారాయణరాజుగారు 26 వ తారీఖున పరిశ్రమల డిమాండు వస్తున్నది కనుక అప్పుడు అడుగవచ్చును. Information ను తెలుసుకోవచ్చును. దానిని గురించి ఇప్పుడు చర్చ అవసరంలేదు, I am therefore disallowing the adjournment motion.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం) : సంజాయిషీ తెప్పించినపుడు మూసివేసిన 15 రోజులకు retrenchment benefits ఇప్పించడానికి తగిన చర్యలు తీసుకుంటారా ?

శ్రీ ఎన్. సంజీవరెడ్డి : చట్ట సమ్మతంగా రావలసిఉంటే వస్తాయి. ప్రత్యేకమైన పరిస్థితులలో ఏ చట్టం అన్వయిస్తుందో నేను off hand గా చెప్పలేను. న్యాయంగా రావలసిఉంటే చూస్తాము.

శ్రీ పి. సుందరయ్య : Temporary lay off క్రింద పరిగణించి ఇవ్వవలసి ఉంటుంది.

## POINT OF INFORMATION RE: ASSURANCES MADE BY MINISTERS ON THE FLOOR OF THE ASSEMBLY

శ్రీ ఎమ్. రాజేశ్వరరావు (దివి - రిజర్వుడు) : Point of information, Sir, ఈ శాసన సభలో ప్రశ్నోత్తరాల సందర్భములో శాసన సభ్యులు చేసే సూచనలకు, వేసే ప్రశ్నలకు మంత్రులు పరిశీలిస్తున్నాము, under consideration అని అనేక విషయాలలో చెబుతున్నారు. అవి వారు వ్యక్తిగతంగా చెబుతున్న విషయాలని మేము అనుకోము. ప్రభుత్వ ప్రతినిధులుగా చెబుతున్నారనే

అనుకొంటున్నాము. వీటన్నింటిపై వారు ఎటువంటి చర్యలు తీసికుంటున్నది సభవారికి తెలియదు. ఈ సందర్భములో పార్లమెంటులో ఉన్న సాంప్రదాయం సంగతి చెప్పవలసియున్నది. అక్కడ consideration లో ఉన్నాయని చెప్పిన అన్ని విషయాలమీద రెండు మూడు నెలలలో ఒక note రూపంలో పార్లమెంటు సభ్యులకు అందించే అలవాటు ఉన్నది. దానిని scrutinise చేయడానికి అక్కడ ఒక కమిటీ ఉన్నది. మనకు కూడా ఒక రూల్సు కమిటీ ఉన్నది. ఆ కమిటీవారు ఇలాంటి అవకాశం కలిగించడానికి provision create చేశారా, లేదా ? మూడు సంవత్సరాల క్రితం under consideration అని చెప్పిన విషయాలపై కూడా ఏమిచర్య తీసుకున్నారో తెలియడంలేదు. కాబట్టి ఇక ముందైనా పార్లమెంటులోని సాంప్రదాయం పద్ధతిలో రెండు మూడు నెలలకు అయినా under consideration అన్న విషయాలపై ప్రభుత్వం ఏమిచర్య తీసుకున్నదో తెలియచేస్తూ ఒక note ను సభ్యులకు అందచేసే ఏర్పాటు చేయుస్తారా?

శ్రీ ఎన్. సంజీవరెడ్డి: ఉన్న రూల్సు పాటిస్తున్నాము. Off hand గా surprise spring చేస్తే సమాధానంచెప్పాలంటే సాధ్యంకాదు, మంత్రులంత శక్తివంతులు కారు, మాకుశక్తి ఉన్నంతవరకు ప్రయత్నంచేస్తున్నాము.

*Sri M. Rajeswara Rao rose in his seat*

మిస్టర్ స్పీకర్ : మీరుచెప్పినది, ముఖ్యమంత్రిగారి జవాబు సభవారికి అర్థమైనవి. మరల చర్చమొదలుపెడితే లాభంలేదు. రూల్సు కమిటీలో ఒక proposal ఉన్నది. దానిని full గా committee లో చూస్తాము.

*The Minister for Planning and Development (Sri V. B. Raju):* The rules will come before the House. So, nothing need be said now as the Rules Committee is going through them and they will come before the House.

మిస్టర్ స్పీకర్ : ఇపుడు అమలులో ఉన్న రూల్సు ప్రకారం అటువంటిది ఏమీలేదు. Assurances committee వేయాలా, అక్కరలేదా, వేస్తే ఏషరతులమీద వేయాలనేది ఆలోచిస్తాము. తరువాత సభముందుకువస్తుంది.

శ్రీ పి. సుందరయ్య : Assurances Committee విషయంఅలాఉంచండి. ప్రభుత్వం ఏమీచేయకపోతే ఏమి చేయాలనేది Assurances Committee చూస్తుంది, సామాన్యంగా పార్లమెంటులోని సాంప్రదాయం ఏమిటంటే, Assurances Committee ముందుకు వచ్చినా రాకపోయినా, ప్రశ్నోత్తరాల సందర్భంలోను ఇతరచర్యల సందర్భంలోను ఆలోచిస్తాము, చర్యతీసుకుంటాము అనిచెబితే తరువాత కొంతకాలమైనతరువాత - 1, 2, 3 నెలలైన తరువాత—

తాముచెప్పినదానికి ఏమిచేశారో తెలియచేస్తూ Minister for Parliamentary Affairs ఒక note చదువుతారు; దానిని సభ్యులకు circulate చేస్తారు. Assurances Committee సంగతివేరు, consideration చేస్తామన్న విషయాలపై ఏమిచేశారన్న విషయంవేరు. దీనికొరకై మంత్రులు ప్రయత్నంచేస్తే బాగుంటుందని విన్నవిస్తున్నాను.

శ్రీ బి. వి. శివయ్య (మార్టూరు): పార్లమెంటులో ఉన్నట్లు కమిటీ లేకపోయినా మనం Register of Assurances and undertakings అని పెట్టి దానిలో వీటిని ఎక్కించి వాటి విషయమై ఏమిచర్యలు తీసుకున్నారో watch చేసే ఏర్పాటైనా చేయించాలని కోరుతున్నాను.

## BUSINESS OF THE HOUSE

మిస్టర్ స్పీకర్ : ఇంకొకసంగతి, శ్రీ సుందరయ్యగారు correspendence publish చేయవలెనా లేదా అనే విషయమై ప్రశ్న లేవదీశారు. Correspondence publish చేయాలని ఎక్కడా కనిపించడం లేదు. ఈ విషయమై, 'Papers to be placed on the table of the House' అంటే ఏమిటి? అనే విషయమై, ఎల్లుండి చూద్దాము. సభానాయకులు కూడా పరిశీలించవలెనని కోరుతున్నాను. Correspondence అంతా publish చేసి 300 మంది సభ్యులకు, Press కు కాపీలు ఇవ్వాలంటే సాధ్యంకాదు. సుమారు final stage కి వచ్చినతరువాత- not legally final ఇవ్వడం బాగుటుందనే మోస్తరుగా ఊహించాను. నా ఊహ సరిగాఉన్నట్లే కనిపిస్తోంది. ఎల్లుండి ఆ విషయమై తేల్చుకుందాము.

## BUDGET—DEMANDS FOR GRANTS

*DEMAND No. XXVII—Electricity* — *Rs.* 2,56,13,400

*DEMAND No. XLIII—Capital Outlay on Electricity Schemes* — *Rs.* 10,78,00,600

*The Minister for Irrigation and Power (Sri J.V. Narasing Rao):* Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I beg to move:

"That the Government be granted a sum not exceeding Rs. 2,56,13,400 under Demand No. XXVII—Electricity."

"That the Government be granted a sum not exceeding Rs. 10,78,00,600 under Demand No. XLIII—Capital Outlay on Electricity Schemes."

*Mr. Speaker:* Motions moved.

శ్రీ జె. వి. నరసింగరావు : అధ్యక్షా ! పద్దు XXVII విద్యుచ్ఛక్తి క్రింద 2,56,13,400 రు., పద్దు XLIII విద్యుచ్ఛక్తి స్కీముల మీద, పెట్టుబడి ఖర్చు క్రింద 10,78,00,600 రు.లు ప్రభుత్వానికి మంజూరుచేయవలసిందిగా కోరు తున్నాను. అమలుజరుగుతున్న విద్యుచ్ఛక్తి స్కీముల నిర్వహణ ఖర్చులను భరించటానికి ప్రస్తుత ఆదాయంలోనుండి సొమ్ము మంజూరుచేయటానికి మొదటి పద్దులో కోరిన మొత్తం కావలసివున్నది. మామూలు ఆదాయంనుండి పెట్టుబడి పెట్టబడుతున్న లఘు నిర్మాణాల మీద అయ్యే ఖర్చు నిర్వహించటానికి విలువ తగ్గుదలకు మరియు ప్రత్యేక రిజర్వునిధులకు కేటాయింపు, సిబ్బందిఖర్చు ఇవి నిర్వహణ ఖర్చులలో చేరగలవు. పద్దు XLIII క్రిందకోరిన మొత్తం విద్యుచ్ఛక్తి స్కీముల కయ్యే పెట్టుబడి ఖర్చుకు కావలసివుంది. విద్యుచ్ఛక్తి క్రింద కోరిన మొత్తంలో అధికభాగం విద్యుచ్ఛక్తి స్కీముల పెట్టుబడి ఖర్చుకు సంబంధించిన పద్దు XLIII క్రిందకే వస్తుంది. 1957-1958 సం. కి విద్యుచ్ఛక్తి స్కీముల పెట్టుబడి ఖర్చులకు గాను కోరిన మొత్తాల యొక్క మొత్తం 10,78,00,600 రు.లు నికరం 6,25,22,000 రు. విద్యుచ్ఛక్తి రంగంలో జరిగే కార్య కలాపాలను గూర్చి సమగ్రంగా మీ ముందుంచటానికి వీలుగా ఈ రెండు పద్దులను కలిపి ఒకటిగా నివేదిస్తున్నాను.

మన ఆంధ్రప్రదేశ రాష్ట్రంలోని ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి విషయంలో సాధించిన పురోభివృద్ధిని గురించి క్లుప్తంగా వివరించటం భావ్యం అని తలుస్తున్నాను.

మొదటి పంచవర్ష ప్రణాళిక కాలం ప్రారంభమైన నాటికి అంటే 1-4-1951 నాటికి ఆంధ్రరాష్ట్ర ప్రాంతంలో విద్యుచ్ఛక్తి స్కీముల మీద పెట్టుబడి దాదాపు 6 కోట్ల రు.లు. మొదటి పంచవర్ష ప్రణాళికలో కేటాయించ బడ్డ మొత్తం 25,05,00,000 రు. అయితే ఇందులో సుమారు 7 కోట్ల 5 లక్షలు మాత్రమే అవిభక్త మదరాసు రాష్ట్రంలో ప్రణాళికా కాలంలోని పూర్వార్ధములో వినియోగించబడ్డాయి. మిగిలిన 18 కోట్ల రు. మొత్తం ప్రణా ళికా కాలంలోని ఉత్తరార్ధంలో అంటే ఆంధ్రరాష్ట్రం నిర్మాణమైన 1-10-1953 తేదీకి పిమ్మట స్వంతంగా ఖర్చుపెట్టబడింది. అవిభక్తమదరాసురాష్ట్ర కాలంలో జరిగిన లోటు పూర్చబడి, పెట్టుబడి ఖర్చు రెండింతలు పెంపుచేయబడింది. తద్వారా మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తిగా అమలుజరిగింది.

రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద 21 కోట్ల 66 లక్షల రు. మొత్తం కేటాయించబడింది. ఇందులో మొదటి సం. లో 1956-1957 లో 8 కోట్ల 5 లక్షల రు.లు ఖర్చయ్యాయి. దీన్నిబట్టి చూస్తే అభివృద్ధి కార్యక్రమాల గమనం తగ్గలేదని, పైగా అధికమైందని కూడా తెలుస్తుంది. జరుగుతున్న సం.పు

బడ్జెటు మొత్తం 5 కోట్ల 13లక్షల రు.లు ప్రణాళికా ప్రారంభంనాటికి సాలీనా మొత్తం ఆదాయం కేవలం 40 లక్షల రూపాయలే. ఆంధ్రరాష్ట్రం నిర్మాణం అయిన 1-10-53 తేదీనాటికి ఆ ఆదాయం 80 లక్షల రూపాయలవరకు వచ్చింది.. 1955-56 సంవత్సరంలో అది 169 లక్షల రూపాయల వరకు పెరిగింది. రెండవ పంచవర్ష ప్రణాళిక యొక్క మొదటి సంవత్సరమున 1956-57 లో ఆ సాలీనా ఆదాయం 212 లక్షల రూపాయల మొత్తం అయింది. జరుగుతున్న ఆర్థికసంవత్సరంలో మొత్తం ఆదాయం 3 కోట్లు కాగలదని ఆశించుచున్నాము.

విలువ తగ్గుదల క్రింద, ప్రత్యేక రిజర్వు నిధి క్రింద యివ్వవలసిన క్వాటా పైకంతో చేరి నిర్వహణ ఖర్చులు 1955-56 సంవత్సరంలో 101 లక్షల రూపాయలు. 1956-57 సంవత్సరంలో 80లక్షల రూపాయలు అయ్యాయి. ఆ ఖర్చు ఈ జరుగుతున్న 1957-58 ఆర్థిక సంవత్సరంలో 114 లక్షల రూపాయలని అంచనా వేయబడింది.

మాచ్ ఖండ్ జల విద్యుచ్ఛక్తి స్కీముల క్రింద 17,000 కిలోవాట్ల శక్తిగల మొదటి విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రం 1955 లో పని ప్రారంభించింది. అనుకున్న కాలంకంటె ఒక సంవత్సరం ముందే దీన్ని ప్రారంభించారు. అదే జలవిద్యుచ్ఛక్తి సరఫరాకు మన రాష్ట్రపతి 1955 ఆగస్టు 19 తేదీన ప్రారంభంచేశారు. అదే శక్తిగల మిగిలిన రెండు ఉత్పాదక యంత్రాల పనికూడ ప్రారంభమయింది. వీటితో మాచ్ ఖండ్ అభివృద్ధి కార్యక్రమంలో మొదటి దశ పూర్తయింది. 21,000 కిలోవాట్ల శక్తిగల మరో మూడు విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాల కోసం పురమాయింపు జరుగుతోంది. అవి వస్తున్నాయి. వచ్చే సంవత్సరం జులై మాసానికి పూర్వమే అవి పని ప్రారంభించగలవు.

జాలాపూటి డాము నిర్మాణం surplus course level వరకు వీటిని నిలువచేసే దశదాకా పని యిటీవలే పూర్తయింది. అనుకున్న గడువుకు ఒక సంవత్సరం ముందే యీ పని పూర్తిచేయబడింది. స్థాపింపబడుతున్నవాటితో సహా అన్ని విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలకు ఈ డాము వల్ల నీరు లభ్యం అవుతుంది.

తుంగభద్రా జలవిద్యుచ్ఛక్తి స్కీముక్రింద మొదటిదశలో తుంగభద్రా డాము పవరు హౌస్‌కు 3000 కిలోవాట్ల శక్తిగల రెండు విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు హంపీ కాలువ పవరు హౌస్‌కు అదే శక్తిగల మరి రెండు యంత్రాలు కలవు. మొదటి రెండుయంత్రాలు పనిచేయడం ప్రారంభించాయి. తక్కిన రెండు యంత్రాలు ఈ సంవత్సరం అక్టోబరు మాసం నాటికి పనిచేయడము ప్రారంభిస్తాయి.

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలం ప్రారంభమయిననాటికి చిన్నచిన్న స్టీము డీసెలు కేంద్రాలు అక్కడక్కడ చాల తక్కువ సంఖ్యలో మాత్రమే ఉండేవి.

ఆంధ్రరాష్ట్ర విద్యుచ్ఛక్తి శాఖ నాలుగు సంవత్సరాలకంటె తక్కువ కాలంలోనే అటు ఒరిస్సా సరిహద్దునుంచి యిటు మైసూరు సరిహద్దు వరకు రాష్ట్రం అంతా గ్రిడ్‌ను విస్తరింపజేసింది. మాచ్‌ఖండ్ నుంచి బెజవాడ వరకు 132 కిలోవాట్ల శక్తితోను, అక్కడనుంచి తుంగభద్రా డాము వరకు 66 కిలోవాట్ల శక్తితోను ఈ గ్రిడ్ పని పూర్తిచేస్తోంది. దీని మొత్తం పొడవు High tension lines, Low tension lines కలిసి 5,000 మైళ్ళు. మాచ్‌ఖండ్ తుంగభద్ర జలవిద్యుత్ కేంద్రాలు రెండును విశాఖపట్టణం, విజయవాడ, నెల్లూరులలో వున్న థర్మల్ విద్యుత్ కేంద్రాలు మూడును కలిసి సమన్వయ పూర్వకంగా పనిచేయడానికి యీ గ్రిడ్ తోడ్పడుతుంది. దీనివల్ల మొత్తంమీద ఎక్కువ economy జరుగగలదు. రాష్ట్రంలో మొత్తం విద్యుచ్ఛక్తి అవసరాలు 1-4-1951 నాటికి ఉన్న 12,000 కిలోవాట్లనుండి 1-10-1953 నాటికి 28,000 కిలోవాట్లకు, 1-4-56 నాటికి 38,000 కిలోవాట్లకు పెరిగాయి. విద్యుచ్ఛక్తి అందచేయబడుతున్న consumers 1-4-1951 నాటికి ఉన్న 10,000 నుండి 1-10-1953 నాటికి 33,000 కు 1-4-1956 నాటికి 1,08,000 కు పెరిగారు. జరుగుతున్న ఆర్థిక సంవత్సరాంతానికి వీరిసంఖ్య 1,23,000 వరకు పెరుగగలదని తలంచబడుతున్నది. ఈ అభివృద్ధిని సాధించడంలో విద్యుచ్ఛక్తి శాఖ బాగా పెరిగింది. శాఖ త్వరత్వరగా పెరిగిపోతున్నప్పుడు సాంకేతిక సమర్థత లోపించకుండా ఉండటానికి ఈ శాఖలో పనిచేస్తున్న ఇంజనీర్లకు విదేశాలలో training ఇవ్వబడింది. ఈ Training కేవలం Colombo Plan క్రింద, International fellowship వంటి అంతర్జాతీయ Training Schemes క్రిందనే గాకుండా, సరఫరా కంట్రాక్టులలో భాగంగా ఉత్పత్తిదార్ల కర్మాగారాల్లో కూడవీరికి పని నేర్పటానికి ఏర్పాట్లుచేయబడ్డవి. లైన్‌మన్‌లకోసం రెండు సాంకేతిక శిక్షణ పాఠశాలలు గుంతకల్లు, విజయవాడలలో స్థాపించబడ్డాయి. శాఖకు సంబంధించిన workshops నెలకొల్పబడ్డాయి. శాఖవారు తెల్పిన డిజైన్‌లలో ట్రాన్స్‌మిషన్ లైను టవర్లు, సపోర్టులు తయారు చేయటం జరిగింది. వీటిని తయారు చేయటానికి అమెరికా, రష్యా, జపాను, యూరపులనుంచి పెద్దపెద్ద మొత్తాలలో ఉక్కు దిగుమతి చేసుకోబడింది. ఆ విధంగా శాఖలో తయారైన 66 కిలోవాట్ల, 132 కిలోవాట్ల ట్రాన్స్‌మిషన్ లైన్లు పొదుపుగా త్వరగా తయారైనవిగా కూడా ఉన్నాయి. నిర్మాణ కార్యక్రమం ఎడతెగకుండా త్వరితంగా జరగాలంటే ఇంజనీరింగ్‌కు పనికి వచ్చేవస్తుసామగ్రి ధారాళంగా అందుబాటు కావటం అవసరం. వివిధ రకాల వస్తుసామాగ్రిని సమృద్ధిగా ఉంచటానికి 6 సెంట్రల్ స్టోరులు నెలకొల్పబడ్డాయి.

విద్యుచ్ఛక్తి తలసరి (Per capita) వినియోగం ఏ రాష్ట్రానికైనా, ఏదేశానికైనా ఆర్థిక పురోగతికి సూచిక అని అందరు ఒప్పుకొన్నదే. ఈ వినియోగం 1-4-1951 తేదీనాటికి 2·5 యూనిట్లు ఉండేది. అది 1-10-1953 తేదీనాటికి 5 యూనిట్లకు, 1-4-1956 తేదీనాటికి 8 యూనిట్లకు పెరిగినది. కాని యిది కొన్ని యితర దేశాలతో పోల్చిచూస్తే అతిస్వల్పం అని తెలుస్తుంది. ఈ వినియోగం కెనడాలోను, అమెరికాలోను 3,000 యూనిట్లు, ఇంగ్లండులో తలసరి. 1,000 యూనిట్లు, జపానులో 500 యూనిట్లు, మనదేశంలోనే పోల్చిచూచుకుంటే మదరాసులో 26 యూనిట్లు, మైసూరులో 40 యూనిట్లకు పైగాను ఉండగా ఇండియా మొత్తంమీద కూడా 25 యూనిట్లు కనబడుతుంది.

పల్లెప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసేవిషయంలో కూడ, గత 3½ సంవత్సరాలుగా చాలవరకు పనిజరిపినప్పటికీ, ప్రస్తుత పురోగతి యింకా స్వల్పంగానేఉంది. 1-4-1951 తేదీనాటికి 200 గ్రామాలకు విద్యుచ్ఛక్తి అందచేయబడింది. ఈ గ్రామాల సంఖ్య 1-10-1953 తేదీనాటికి 300 కు, 1-4-1956 తేదీ నాటికి 700 రు.లకు 1-4-1957 నాటికి 850 రు. వరకు పెరిగింది.

విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ఇంతకు పూర్వంనుంచే ప్రభుత్వం స్వాధీనంలోఉంది. పంపిణీ విషయంలో 1955-56 ఆఖరుకు లైసెన్సుపొందినసంస్థలు 11 మాత్రమే ఉన్నాయి. వీటిలో 2 స్థానిక అధికార సంస్థలు. ఈ 11 సంస్థలలో 5, అనగా రాజమండ్రి, గుంటూరు, ఇచ్ఛాపురం, గుడివాడ, తిరుపతి విద్యుచ్ఛక్తి సంస్థలు ప్రభుత్వం యిటీవల స్వాధీనపరుచుకొన్నది. మిగిలిన 6 సంస్థలు కొద్ది సంవత్సరాలలో స్వాధీన పరుచుకోబడగలవు. ఇది పూర్తి అయితే ఉత్పత్తి పంపిణీ పూర్తిగా ప్రభుత్వం స్వాధీనంలో ఉంటుంది. ఇందువల్ల రాష్ట్రవ్యాప్తంగా విద్యుచ్ఛక్తిని త్వరితంగాను, తగినంతగాను విస్తరింప జేయడానికి వీలుంటుంది. ఇంతేకాకుండా పల్లె ప్రాంతాలకు త్వరితంగా విద్యుచ్ఛక్తిని సరఫరా చేయవచ్చును. పల్లెప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా ఎక్కువ లాభదాయకంగా లేనందువల్ల లైసెన్సు పొందినసంస్థలు మందకొడిగా పనిసాగిస్తున్నాయి. రెండవ పంచవర్షప్రణాళికక్రింద సుమారు 11 కోట్ల రూపాయల ఖర్చు తలపెట్టబడింది. ఈ ప్రణాళికలో యీక్రిందివాటి ఏర్పాటు కలదు.

1. మాచ్ ఖండ్ వద్ద అదనంగా 21,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు మూడింటిని నెలకొల్పడం; ఇవి యిప్పుడు నిర్మాణంలో ఉన్నాయి.

2. తుంగభద్ర, హంపి కేంద్రాలలో 3,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు నాల్గింటిని నెలకొల్పడం,

3. నెల్లూరులో 30,000 కిలోవాట్ల స్టీంథర్మల్ కేంద్రాన్ని నెల కొల్పడం

4. సీలేరు జల విద్యుచ్ఛక్తి స్కీముకు 50 లక్షల రూపాయల మొత్తం కేటాయింపు,

ఫెర్రో మాంగనీసు పరిశ్రమ, **Ship building yard, Caltex** మరియు **Cement factories** వంటి పారిశ్రామిక వినియోగదార్లకు సరఫరా చేయటానికినీ, గ్రామాలకు విద్యుచ్ఛక్తిని అందచేసేందుకును 6 కోట్ల రూపాయలు కూడా యిందులో కేటాయించబడ్డాయి. ఈ పనుల మూలంగా అదనంగా 1,30,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పాదనచేసే **capacity** చేకూరి, పీక్ లోడు 60,000 కిలోవాట్లనుండి 118,000 కిలోవాట్లకు పెరుగుతుంది. తలసరి వినియోగం 8 నుండి 20 యూనిట్లకు హెచ్చుతుంది. రెండవ ప్రణాళికలోని మొదటి సంవత్సరంలో అన్నీ పూర్తిగా నెరవేరినవి.

తెలంగాణాప్రాంతంలో విద్యుచ్ఛక్తి విస్తరణ విషయంలోఅభివృద్ధిసంతృప్తికరంగా లేదు. ఈ ప్రాంతంలో విద్యుచ్ఛక్తి విస్తరణ విషయంలో అభివృద్ధి హైదరాబాదు, శికింద్రాబాదు జంట నగరాలలో మాత్రం జరిగినదని అనవచ్చు. మొదటి ప్రణాళిక ఆఖరయ్యేసరికి విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడిన పట్టణాలు. గ్రామాలు 11 మాత్రమే. విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులమీద మొదటి పంచవర్షప్రణాళిక ప్రారంభంనాటికి అయిన ఖర్చు సుమారు 6 కోట్ల రూపాయలు. ప్రణాళిక కాలంలో అయిన ఖర్చు 3 కోట్ల రూపాయలు అనగా మొదటి సంవత్సరం ప్రణాళిక ఆఖరునాటికి మొత్తం ఖర్చు 9 కోట్ల రూపాయలు. తెలంగాణాలో తలసరి వినియోగం 5 యూనిట్లు మాత్రమే. హైదరాబాదుకు సుమారు 140 మైళ్ల దూరంలో ఉన్న రామగుండం థర్మల్ కేంద్రం వల్ల చెప్పుకోదగ్గ ప్రయోజనం ఇంతవరకు కలుగలేదు. ఇందులో 12,500 కిలోవాట్ల కెపాసిటీగల **Turbo alternators** మూడు ఉన్నాయి. రామగుండం నుండి ఉత్తరానగల సిర్పూరుకు, దక్షిణానగల సిద్దిపేటకు, ఆగ్నేయానగల వరంగల్లుకు పోయే 66 కిలోవాట్ల ట్రాన్స్‌మిషన్ లైనులను ఇంకా పూర్తిచేయవలసి ఉంది. హైదరాబాదుకు 80 మైళ్ళ దూరంలో ఉండే నిజాంసాగర్ జలవిద్యుత్ కేంద్రంలో 5000 కిలోవాట్ల ఉత్పాదిక యంత్రాలు 3 ఉన్నాయి. ఈ కేంద్రం యొక్క ఉత్పాదక శక్తి మారుతూ ఉంటుంది. నీటిపారుదల కాలం ఆఖరయ్యేసరికి 3000 కిలోవాట్ల వరకు అది తగ్గుతుంది. నిజాంసాగరు నుండి 66 కిలోవాట్ల ట్రాన్స్‌మిషన్ లైను హైదరాబాదుకు 5 మైళ్ళవరకు పూర్తి అయినప్పటికీ నీటిపారుదల కాలంలో నిజాంసాగర్ కేంద్రంనుండి విద్యుచ్ఛక్తిని పూర్తిగా వాడుకోవడానికిగాను అక్కడినుండి హైదరాబాదు స్టీం థర్మల్ కేంద్రానికి

యింటర్ కనెక్షను కెపాసిటీని యింకా పెంచవలసి ఉంది. హైదరాబాద్ థర్మల్ కేంద్రం 15,000 కిలోవాట్ల శక్తి కలిగి ఉండటంవల్ల ఇప్పటికి పూర్తిగా లోడ్ అయి ఉంది. ఉత్పాదక యంత్రాలలో చాలా భాగం పాతవై ఉన్నాయి. రెండవ పంచవర్ష ప్రణాళికలో తెలంగాణా ప్రాంతానికి పెట్టదలచిన ఖర్చు సుమారు 6 కోట్ల రూపాయలు మాత్రమే. దీనిలో 2 కోట్ల రూపాయల మొత్తం దేవనూరు డాముకు కేటాయింపబడింది. మిగిలిన మొత్తమునుండి నగరంలో విద్యుచ్ఛక్తి పంపిణీని అభివృద్ధిపరచే పథకానికి కొంత, రామగుండం హైదరాబాదు థర్మల్ కేంద్రాలలో చిన్న చిన్న చేర్పులకు కొంత, పల్లె ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా కోసం కొంత సల్ప మొత్తము ఉద్దేశింపబడింది.

విద్యుచ్ఛక్తి శాఖచే నిర్వహించబడి, కేంద్ర జలవిద్యుత్ కమీషనుచే పరిశీలించబడి తుదిరూప మివ్వబడిన లోడ్ సర్వేలనుబట్టి చూస్తే ఇప్పుడున్న విద్యుత్ శక్తి అంతా రెండవ పంచవర్ష ప్రణాళికా కాలం పూర్తిఅయ్యేసరికి వ్యయమైపోతుంది. పరిశ్రమలు, వ్యవసాయం అభివృద్ధి చేయడానికి 1960 - 61 నుండి తదుపరి సరఫరాకు విద్యుచ్ఛక్తి ఉండదు. ఈ విద్యుచ్ఛక్తి కొరత సమస్యను పరిష్కరించాలంటే సీలేరు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు మొదటిదశ పనిని తక్షణం ప్రారంభించి 4 సంవత్సరాలలో అంటే 1961 కి పూర్తిచేయాలి. ఇదికేవలం విద్యుచ్ఛక్తి సరఫరాకు సంబంధించిన ప్రాజెక్టు. మాచ్ ఖండ్ ఒప్పందంలో దీని అభివృద్ధి హక్కులు ఒరిస్సా ప్రభుత్వంచే ఆంధ్ర ప్రభుత్వానికి యివ్వబడ్డాయి. అందుచేత ఇది పూర్తిగా ఆంధ్రరాష్ట్రంయొక్క అధికారం క్రింద యుంటుంది. ఇది మాచ్ ఖండ్ ప్రాజెక్టు మిగులు నీటిని కూడా వినియోగిస్తుంది. దీన్ని 5 కోట్ల రూపాయల పెట్టుబడితో పూర్తిచేయవచ్చు. దీనివలన 1961 నాటికి 75,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి లభ్యమవుతుంది. సీలేరు ప్రాజెక్టును ప్రారంభిస్తే మాచ్ ఖండ్ ప్రాజెక్టునుంచి విడుదల చేయబడే కట్టడపు యంత్రపరికరాలను, సిబ్బందిని వినియోగించుకోవచ్చును. ఈ విషయాన్ని మన ముఖ్యమంత్రిగారు కేంద్ర నీటిపారుదల విద్యుత్ శాఖ మంత్రిగారికి నివేదించారు. భారత ప్రభుత్వం ఆమోదానికై తగు కృషి చేయబడుతుంది.

పల్లె ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసే విషయం యింకో పెద్ద సమస్యగా ఉంది. రెండవ పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమల loads కు, పల్లె ప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి కేటాయించబడ్డ 6 కోట్ల రూపాయలలో సగానికంటె ఎక్కువ మేజర్ ట్రాన్స్ మిషన్ లైనులకు సబ్ స్టేషనుల పైన ఖర్చు చేయబడింది.

ఇవి గరివిడిలోవున్న ఫెర్రోమాంగనీసు పరిశ్రమ, విశాఖపట్టణంలోవున్న కాల్ టెక్సు నూనె శుద్ధి కర్మాగారం, హిందుస్తాన్ నౌకా నిర్మాణ కేంద్రం,

విజయవాడలో వున్న క్రిష్ణా సిమెంటు కంపెనీ, ఆంధ్ర సిమెంటు కంపెనీ, మాచెర్ల సిమెంటు ఫ్యాక్టరీ, నాగార్జున సాగరం కట్టడపు డిపో పనులు మొదలయిన భారీ పరిశ్రమల **Bulk loads** కు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి ఉద్దేశింపబడ్డాయి. నీటివల్ల అదనంగా ఒక కోటి రూపాయల ఆదాయం వస్తుంది. తత్ఫలితంగా విద్యుచ్ఛక్తి శాఖ ఆర్థికపరిస్థితి చాలా వరకు బాగుపడుతుంది. అయితే పల్లె ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి సుమారు రెండునుండి, రెండున్నర కోట్ల రూపాయలు మాత్రం వుంటాయి. క్రిందటి సంవత్సరం అయిన ఖర్చులను ఈ సంవత్సరము కాబోయే ఖర్చులను మినహాయిస్తే రాబోవు 3 సంవత్సరాలలో పల్లె ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా నిమిత్తం ఎక్కువేమి మిగలదు. రాబోయే సంవత్సరాలలో మనకు ఎక్కువ డబ్బు లభిస్తేనే తప్ప, పల్లెప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా కార్యక్రమాన్ని నెమ్మదిగా సాగించవలసి ఉంటుంది. విద్యుచ్ఛక్తి కావాలని ప్రజలు గట్టిగా కోరుతున్నారు. కొంతగాక కొంతైనా అందజేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ పరిస్థితి కేంద్ర నీటి పారుదల విద్యుత్ శాఖ మంత్రిగారి దృష్టికి మొన్న మొన్ననే వారు యిక్కడికి వచ్చినప్పుడు తేబడింది. భారత ప్రభుత్వంతోను, ప్లానింగు కమిషన్‌తోను ఈ విషయంగురించి తగు కృషి జరుగగలదు. రాష్ట్రప్రభుత్వం ఇప్పుడున్న ఆదాయాన్ని వీలయినంత పొదుపుగ వాడడానికి శక్తివంచనలేకుండా కృషిచేస్తున్నది. తద్వారా విద్యుచ్ఛక్తిని వీలైనన్ని ఎక్కువగ్రామాలకు విస్తరింపచేయటానికి కృషి జరుగుతున్నది. ఇందుకోసం తీసుకుంటున్న చర్యలలో సాధ్యమైనంతవరకు చౌక కొయ్యస్తంభాలను వాడటానికి ప్రయత్నించడం ఒకటి.

(iii) ఈ లోగా, విద్యుచ్ఛక్తి సరఫరా పొందేవారు తమంత తామే డబ్బు అప్పుయిచ్చే యెడల విద్యుచ్ఛక్తి సరఫరా విస్తరణకు సంబంధించిన పథకాలను ప్రభుత్వం కొనసాగిస్తుంది. అట్టి అప్పు పద్ధతిమీద విస్తరణ స్కీములను అమలుపరచడానికి సంబంధించిన పథకపు వివరాలు తయారవుతున్నాయి.

రెండవ పంచవర్ష ప్రణాళికను దిగ్విజయంగా అమలు పరచాలంటే విదేశ ద్రవ్య మారకంలో ఏర్పడ్డ కొరత ఒక పెద్ద సమస్యగావుంది. భారత ప్రభుత్వానికి ఈ మధ్య ఈ విషయం గురించి విన్నవించాం. కావలసిన విదేశ మారకంలో కొంత మొత్తాన్ని భారత ప్రభుత్వం మంజూరు చేసిందని తెలిసి వుండెను. కనీసం తదుపరి చెల్లించే పద్ధతిమీదనైనా భారతప్రభుత్వం రెండవ పంచవర్ష ప్రణాళికలోని ప్రాజక్టులకుగాను ఇటీవల సహాయంచేసినట్లుగా మన రాష్ట్రానికి ఎక్కువగా విదేశ మారక ద్రవ్యాన్ని సహాయంచేస్తుందని ఆశిస్తున్నాము. నిన్ననే ముఖ్యమంత్రిగారు శ్రీ టి. టి. కృష్ణమాచారిగారితో కూడ యీ విషయము మనవిచేశారు. ముఖ్యంగా రామగుండంకొరకు నూటికి 95

పాళ్ళు పని పూర్తిఅయినది. గనుక అక్కడి ముప్పయి లక్షల వరకు, గరివిడి, యితర పనులకొరకు యాభై లక్షల వరకు వెంటనే విదేశమారకపు ద్రవ్యము మనకు అవసరముందని వారు చెప్పారు. వారు ఆలోచిస్తున్నారు.

మొత్తం రాష్ట్రంలో లభ్యమగు విద్యుచ్ఛక్తి నంతటినీ సమీకరించి, దానిని రాష్ట్రం మొత్తంమీద పొదుపుగాను, సమంగాను పంచడంకోసం మొత్తం ఆంధ్రప్రదేశానికే సమగ్రమైన ఒక గ్రిడ్ ఏర్పాటు చేయబడింది. క్రమంగా అది అమలు జరుపబడి, 2, 3 సంవత్సరాలలో పూర్తి చేయబడుతుంది. అయితే తుంగాభద్ర జల విద్యుత్ కేంద్రాన్ని హైదరాబాదు, రామగుండం థర్మల్ కేంద్రాలలో 132 కిలోవాట్ల లైను మూలంగా కలిసే పథకం పరిశీలనక్రింద యున్నది. ఇది సాధ్యపడితే, ఈ పని మూలంగా 20 లక్షల రూపాయల విలువగల బొగ్గు ప్రతిసంవత్సరం మిగలడమే కాకుండా తుంగభద్రా జల విద్యుత్ స్కీము యొక్క ఆర్థికస్థితి చాలావరకు బాగుపడుతుంది.

రామగుండం, థర్మల్ కేంద్రంనుండి ఆరంభమయ్యే 66 కిలోవాట్ల ట్రాన్సుమిషన్ లైనులు ఈ ఆర్థిక సంవత్సరంలోనే పూర్తిచేయబడి మొత్తంమీద 12,000 కిలోవాట్ల శక్తిగల **Bulk loads** తో సంధించబడగలవు. నీటిపారుదల కాలంలో నిజాంసాగర్ ట్రాన్సుమిషన్‌లైను టెర్మినస్‌ను, హైదరాబాదు థర్మల్ కేంద్రంకును మధ్యగల ఐదుమైళ్ళ లింకుకు బలంచేకూర్చబడుచున్నది.

పల్లెప్రాంతాలకు విద్యుఛ్చక్తి సరపరావిషయంలో ఈ సంవత్సరం, ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల్లోని దాదాపు 300 గ్రామాలకును ఇంచుమించు అన్నితాలూకా కేంద్రాలకును విద్యుచ్ఛక్తి అందజేయుటకు ప్రయత్నించబడుతున్నది.

ఆంధ్రప్రదేశ్ అంతటా మొత్తంమీద 50,000 కిలోవాట్ల లోడు అదనంగా సంధించ బడగలదు. దీనివల్ల ఈ సంవత్సరం సాలీన ఒకకోటి రూపాయల మొత్తమురాబడి వస్తుంది. (వచ్చేసంవత్సరం రాబడి 2 కోట్ల రూపాయలకు పెరుగుతుంది.) దానితో జరుగుకున్న ఆర్థిక సంవత్సరపు మొత్తపు రాబడి (3) కోట్లవుతుంది.

ఈ శాఖ కార్యదక్షతతోను, శీఘ్రతతోను, సౌష్ఠవముతోను పొదుపైన వ్యాపారసరళిలో పనిచేయుటకు వీలుగాను, రాష్ట్రాలన్నింటికీ భారత ప్రభుత్వం ఇచ్చిన సూచనలకు అనుగుణంగాను రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు ఒకటి ఈ సంవత్సరంలోపల ఏర్పాటు చేయబడగలదు. ప్రజాభిప్రాయాన్నికూడా బోర్డు గ్రహిస్తూవుండేనిమిత్తం రాష్ట్ర విద్యుచ్ఛక్తి కన్సల్టేటివు కౌన్సిలుకూడా ఒకటి ఏర్పాటుచేయబడగలదు. ఈ కౌన్సిలులో పరిశ్రమలు, వాణిజ్యం,

వ్యవసాయం కార్మికులు స్థానిక సంస్థలు, విద్యుచ్ఛక్తి వినియోగదార్లు రవాణా మొదలగు వివిధవర్గాలకు సంబంధించిన ప్రతినిధులకు ప్రాతినిధ్యమివ్వబడగలదు. మూడవ పంచవర్ష ప్రణాళికలో చేర్చవలసిన విద్యుచ్ఛక్తి స్కీములన్నీ రెండవ ప్రణాళికా కాలంలోనే పరిశోధింపబడి సాంకేతికంగా సౌష్ఠవమైన స్కీములు రూపొందించబడాలని, వాటిని పరిశీలించి నిర్ణయించే నిమిత్తం సకాలంలో తమకు అందజేయడానికి ప్లానింగు కమిషన్‌వారు అడిగివున్నారు.

క్రొత్త స్కీములను పరిశోధించే నిమిత్తం రెండవ పంచవర్ష ప్రణాళికలో 10 లక్షల రూపాయలు మాత్రమే ఏర్పాటై వున్నవి. ఇది మూడవ పంచవర్ష ప్రణాళికలో చేర్చే నిమిత్తం సమర్పించవలసిన క్రొత్త స్కీములన్నిటినీ పరిశోధించడానికి సరిపోదు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి విద్యుచ్ఛక్తి సాధన సంపత్తి బాగానే వున్నదని ఈ సందర్భంలో మనం చెప్పుకోవచ్చును. మాచ్‌ఖండ్, ఎగువ సీలేరు, దిగువ సీలేరు, శ్రీశైలం వంటి కేవలం విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల నుండియు, తుంగభద్ర, నాగార్జునసాగర్, సిద్దేశ్వరం, ఇచ్చంపల్లి వంటి నీరు పారుదల మరియు విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల నుండియు ఆంధ్రప్రదేశ్‌కు లభించే జల విద్యుచ్ఛక్తి సంపత్తి ఎంతకాదన్నా పదిహేనులక్షల కిలోవాట్లు ఉంటుందని అనుకోవచ్చును. పారిశ్రామికాభివృద్ధికై ముందుగా కావలసినవి కూడా ఆంధ్ర ప్రదేశ్‌లో పుష్కలంగావున్నది. అందువల్ల గతకాలంలో పారిశ్రామికాభివృద్ధి ఉత్సాహకరంగా లేనప్పటికీ ఇకనుండి మిక్కిలి వేగంగా అభివృద్ధిజరుగుతుందని ఆశించవచ్చును.

కాబట్టి మూడవ పంచవర్ష ప్రణాళికలో విద్యుచ్ఛక్తి అభివృద్ధి కార్యక్రమాన్ని చాలినంతగా ఏర్పాటుచేయడం అవసరం. ఇందుకై రెండవ ప్రణాళికలో ఏర్పాటై వున్న మొత్తాన్ని సీలేరు, శ్రీశైలం, నాగార్జునసాగర్, దేవనూరు మొదలగు క్రొత్త జలవిద్యుచ్ఛక్తి స్కీముల పరిశోధనకోసం పెంచవలసినదిగా భారత ప్రభుత్వాన్ని కోరడానికి ఉద్దేశిస్తున్నాము.

ఈ ప్రసంగాన్ని ముగిస్తూ నేను మనవిచేసేదేమంటే, రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి అభివృద్ధి యొక్క ప్రాముఖ్యత, రాష్ట్రంలో ఆర్థిక అభివృద్ధి జరగడానికి పారిశ్రామిక, వ్యవసాయిక అభివృద్ధికై ఇది నిర్వహించే ప్రధానమైన పాత్ర. విద్యుత్‌శాఖకు, ప్రభుత్వానికి సంపూర్ణంగా తెలుసును. మా చేతనైన ప్రయత్నం అంతా చేస్తూనేవున్నాము. మంజూరయి వున్న రెండవ పంచవర్షప్రణాళికలోని ఏర్పాట్ల పరిమితులనుబట్టి మాత్రం పనిచేయవలసివస్తూంది. ఇప్పుడు విద్యుచ్ఛక్తి క్రింద కోరిన మొత్తాలకు ఏకగ్రీవంగా ఆమోదించవలసిందిగా నేను గౌరవనీయ ఈ సభాసదులను ప్రార్థిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : గౌరవనీయులైన విద్యుచ్ఛక్తి, నీటిపారుదల శాఖ మంత్రిగారు XXVII వ డిమాండు ఎలక్ట్రిసిటీని 2,56,13,400 రూపాయల డిమాండును, XLIII వ డిమాండు Capital out lay on Electricity Schemes రు 10,78,00,600 లకు ఈ రెండవ డిమాండును ప్రతిపాదించారు. ఇక సభ్యులు తమ కోత తీర్మానాలను ప్రతిపాదించవచ్చు.

*Sri P. Sundarayya*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(గ్రామసీమలకు వేస్తామనిచెప్పిన లైనులు త్వరగా వేసి, విద్యుచ్ఛక్తి సరఫరా సంవత్సరాలకొలది సరఫరా చేయకుండా పోతున్నందులకు.)

*Mr. Speaker:* Motion moved.

*Sri B. Sreeramamurthy (Vijayanagaram)*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To criticise Govt.'s failure to publish the Report of the Committee appointed to enquire into the loss of Rs. 40 lakhs worth of Elec. material in Andhra Area.)

*Mr. Speaker*: Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya (Sattenapalli)*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To know at what stage the domestic and street lighting stands in Narnepadu village in Phirangipuram-Guntur line.)

*Mr. Speaker;* Motion moved.

*Sri S. Kasi Reddi (Podili)*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(పొదిలి, దర్శి, కనిగిరి, ఉదయగిరి, తాలూకాలలో వ్యవసాయం బావుల క్రింద జరుగుతుంది. కేవలం వర్షంమీదనే వ్యవసాయం ఆధారపడివుంది. అలాంటప్పుడు ఒంగోలు తాలూకా చీమకుర్తివరకువచ్చిన విద్యుచ్ఛక్తి యీ మెట్ట ప్రాంతాలకు అందచేయుటకు జరుగుతున్న జాప్యాన్ని గురించి చర్చించుటకు.)

*Mr. Speaker*: Motion moved.

*Sri K. L. Narasimha Rao (Yellandu-General)*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(కొత్తగూడెంనుంచి ఖమ్మం పట్టణమునకు విద్యుచ్ఛక్తిని అందించడం విషయంలో జరుపబడుచున్న కాలయాపనను గురించి.)

*Mr. Speaker*: Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya* : I beg to move :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To impress upon the Govt. to retain the workers in Machkund Elec. Schemes including Jalarpet who were given notice of.)

*Mr. Speaker :* Motion moved.

*Sri K. Ramachandra Reddy* (*Ramannapeta*) : I beg to move :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(నల్లగొండ జిల్లాకు విద్యుచ్ఛక్తి సప్లయి గురించి)

*Mr. Speaker* : Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya* : I beg to move :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To discuss the policy)

*Mr. Speaker :* Motion moved.

Sri *Md. Tahsil* (*Bhadrachalam-general*) I beg to move :

"To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(కూనవరంలో విద్యుచ్ఛక్తి పెట్టమని ప్రజలు చాలా కాలంగా కోరు తున్నప్పటికి పెట్టకుండా ఉన్నందులకు)

*Mr. Speaker* :Motion moved.

*Sri B. Dharma Bhiksham* (*Nakrakal*) : I beg to move.

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(నల్లగొండ జిల్లాలోని సూర్యాపేట, మిర్యాలగూడెం మొదలగు తాలూకా కేంద్రాలలో విదుచ్ఛక్తి ఏర్పాట్లు చేయకపోవటం గురించి)

*Mr. Speaker* : Motion moved.

*Sri G. Ganga Reddi (Mudhole)* : I beg to move :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electrictiy by Rs. 100

(ముధోల్ తాలూకాలో భైంసాలో విద్యుచ్ఛక్తి పెట్టనందుకు)

*Mr. Speaker :* Motion moved.

*Sri B. Sreerama Murthy* : I beg to move :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To criticise policy.)

*Mr. Speaker*: Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya:* I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Eelectricity by Rs. 100

(To criticise the policy of Govt. in giving notice of termination of service to the workers in Jalaput and Machkund works when the case was pending with the Tribunal).

*Mr. Speaker:* Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To know at what stage the extension of Electricity stands for Lakkaraju Garlapadu village on Phirangipuram Narsaraopet line.)

*Mr. Speaker:* Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To know what was the cause for burning of the Power House at Macherla.)

*Mr. Speaker:* Motion moved.

*Sri S. V. K. Prasad (Chennur):* I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To discuss the failure to complete the Ramagundam Thermal Scheme in time.)

*Mr. Speaker:* Motion moved.

*Sri Md. Tahsil*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(వెంకటాపురం తాలూకాలోని చెర్లగ్రామంలో విద్యుచ్ఛక్తి పెట్టి వ్యవసాయమును అభివృద్ధి చేయనందుకు)

*Mr. Speaker*: Motion moved.

*Sri G. Yellamanda Reddi (Kanigiri)*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(విద్యుశ్ఛక్తిని కనిగిరిలో నెల్లూరుజిల్లా వ్యవసాయమునకు కూడా యిచ్చుటకుగాను)

*Mr. Speaker:* Motion moved.

*Sri G. Yallamanda Reddy*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(మాచ్ ఖండు విద్యుచ్ఛక్తిని నెల్లూరుజిల్లా కదిరి, పొదిలి, దర్శి తాలూకాలకు సప్లయి చేయుటకు గాను.)

*Mr. Speaker:* Motion moved.

*Sri Ch. Rajeswara Rao (Choppadandi)*: I beg to move:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To discuss the problem of power supply to the towns of Sircilla, Vemulawada.)

*Mr. Speaker* : Motion moved.

*Sri Ch. Rajeswara Rao :*

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To discuss the problem of the power supply from Ramagundam Thermal Power Station to the nearer district of Karimnagar villages.)

*Mr. Speaker:* Motion moved.

### *DEMAND NO. XLIII — Capital Outlay on Electricity Schemes — Rs.* 10,78,00,600

*Sri Vavilala Gopalakrishnayya*: I beg to move:

To reduce the allotment of Rs. 10,78,00,600
for Capital Outlay on Electricity Schemes by Rs. 100

(To undertake the construction of Power Scheme on Sileru this year.)

*Mr. Speaker*: Motion moved.

*Smt. Masuma Begum (Pathergatti):* Mr. Speaker, Sir, in the English list of cut motions that has been circulated, Nos. 656 to 662 are missing.

మిస్టర్ స్పీకర్ : ఇంగ్లీషు లిస్టులో సరిగా వేయలేదా ?

శ్రీ వావిలాల గోపాలక్రిష్ణయ్య : వేరే యిచ్చిన కాగితంలో నాలుగు మిస్ అయినాయి. మొదటి పేజిలో 655 వరకు ఉన్నవి. రెండవ పేజిలో 663 నుంచి ప్రారంభం అయినది.

*Mr. Speaker*: I hope, the hon. Member will adjust herself to this irregularity for today.

*Sri A. B. Nageswara Rao (Rajahmundry)*: Numbers 656 to 662 are mentioned in the list circulated 4 days back.

మిస్టర్ స్పీకర్ : తెలుగు తెలియనివారికి ఇంగ్లీషులో కూడా ఒక కాపీ యివ్వమని నేను ఉత్తరువు చేశాను. అలా రావడంలో కొన్ని లోపాలు జరిగినా యనుకుంటా.

*శ్రీ బి. శ్రీరామమూర్తి : అధ్యక్షా, ద్వితీయ ప్రణాళిక కాలంలో దేశం మొత్తంమీద 10,600 గ్రామాలకు పట్టణాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కల్పించాలని ప్రభుత్వమువారు ఉద్దేశించినారు. వీటిలో 5 వేల జనాభాకు లోపు ఉన్న గ్రామాలకు మాత్రం విద్యుచ్ఛక్తి లభింపచేయాలనేది ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యం అయినది. ఆంధ్రకు సంబంధించినంతవరకు Second Five Year Plan లో 934 గ్రామాలకు పట్టణాలకుమాత్రం విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించాలనేది ప్రభుత్వము యొక్క సంకల్పం. అయితే సంవత్సరానికి సుమారు 150 గ్రామాలకు పట్టణాలను అయినా electricity అందజేయవలసి ఉంటుంది. కాని ఇప్పటివరకు ఉన్నపరిస్థితి చూసుకొంటే సంవత్సరానికి 50, తప్పితే 100 గ్రామాలకు మించి electricity సదుపాయం కల్పిస్తున్నట్లు కనపడదు. ప్రస్తుతం మంత్రిగారు చెప్పినదానిని బట్టి ఆ rate కూడా తగ్గిపోయి ఆమాత్రం కూడా జరిగే పరిస్థితి ఉన్నట్లు కనపడదు.. కాబట్టి rural electrification schemes ఎటువంటి పరిస్థితులలో ఉంటాయో ప్రతిఒక్కరికి స్పష్టంగా తెలుస్తున్నది. ఇంతే కాదు, ఏదైనా ఒక గ్రామానికి విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించినంతమాత్రాన ప్రయోజనంలేదు. Light లు వెలిగించడం మాత్రమే కాదు, విద్యుచ్ఛక్తిని ఉపయోగించి ఉత్పత్తిని పెంచేందుకు ప్రభుత్వము ప్రయత్నంచేయాలి. ఈ రకంగా ప్రభుత్వము ఇప్పటికి ఎంతవరకు చేసినదో మంత్రిగారు తమ ఉపన్యాసంలో స్పష్టంచేసి ఉండలేదు. ఇటువంటి పనిపాట్లు జరిగి ఉంటాయని కూడా నేను ఆశించను. ఇదేరకంగా cottage and small scale industries కు కూడా విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించడంద్వారా వాటిని అభివృద్ధి చేయడానికి అవకాశాలు ఉన్నాయి. అదికూడా ప్రభుత్వం ఇంతవరకు చేసినట్లు కనపడదు. దేశంలో నిరుద్యోగం పోయేందుకు, బీద ప్రజానీకానికి వృత్తి, ఉపాధులు కల్పించేందుకు cottage industries చాల అవసరం. విద్యు

చ్ఛక్తి మీద ఉత్పత్తిని వేగంగా పెంచేందుకు కూడా అవకాశం ఉన్నది కాబట్టి ప్రభుత్వము దీనిని గురించి ఆలోచించాలని కోరుతున్నాను. జపానువంటి దేశాలలో విద్యుచ్ఛక్తిమీద చిన్న చిన్న కుటీర పరిశ్రమలను స్థాపించి పనిచేస్తూ ఉండడం జరుగుతోంది. ఈ దేశంలో కూడా అలా జరిపించడానికి ఇదివరకే భారత ప్రభుత్వము ఒక కమిటీని జపాన్ దేశం పంపించినారు. అవసరమైతే ఇక్కడనుంచి కూడా ఒక కమిటీని పంపించి విద్యుచ్ఛక్తి ద్వారా cottage industries ను అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం ప్రయత్నం చేయాలని నేను కోరుతున్నాను.

Electricity శాఖలో పొదుపు చాల అవసరం అని అనిపిస్తోంది. ఎందువల్లనంటే, Revenue పద్దు క్రింద, ప్రణాళికా నిర్వహణ క్రింద ఖర్చులు విపరీతంగా జరుగుతున్నాయి. ఆంధ్రలో సవరించబడిన అంచనాల ప్రకారం 1956-57 సంవత్సరానికి రు. 80.34 లక్షలు ఖర్చు అయింది. 1957-58 సంవత్సరానికి 114 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. తెలంగాణా ప్రాంతంలో 1956-57 సంవత్సరంలో 86.76 లక్షల రూపాయలు ఖర్చు అవుతూఉంటే 1958 వ సంవత్సరానికి ప్రస్తుత budget provision చూస్తే రు. 123.05 లక్షలకు పెరిగింది. తెలంగాణాలో విద్యుత్ప్రణాళికలమీద రాబడి 141.18 లక్షల రూపాయలు ఉంటే 123.05 ఖర్చు అవుతోంది. మిగిలేది 18.13 లక్షలు మాత్రమే. దీనినిబట్టి వచ్చేది ఎంత ఉన్నదో అంతా ఖర్చుల క్రిందే అవుతూ ఉన్నదన్నమాట. ఖర్చులు తగ్గించేందుకు ప్రభుత్వం తప్పనిసరిగా ప్రయత్నం చేయాలి. Electricity Department లో పొదుపు ఉద్యమం ప్రవేశించడమో, నిష్క్రమించడమో జరుగుతుందని స్పష్టంగా మంత్రిగారు తెలియపరచాలని వారిని నేను కోరుతున్నాను.

ఇక ఈ శాఖలోనివారి జీతాల సంగతికూడా నేను మనవిచేస్తాను. Chief Engineer's Office లో 58 మంది Officers ఉన్నారు. వారందరి జీతం మొత్తం 2,80,000 రు॥ల వరకు ఉన్నది. మొత్తం establishment 368 మంది ఉన్నారు. వారందరికి 2,92,000 రు॥లు జీతాలక్రింద ఖర్చు అవుతున్నది. దీనినిబట్టి మొత్తం establishment కు ఎంతఖర్చు అవుతున్నదో అంత మొత్తము ఆఫీసరులమీద ఖర్చుఅవుతున్నదని తెలుస్తోంది. Additional Chief Engineer Office లో కూడ ఇదేపరిస్థితి ఉన్నది. Establishment మీద అయ్యేఖర్చు ఆఫీసరులమీద అయ్యేఖర్చుకంటె చాలాతక్కువగా ఉంటున్నది. Officers మీద 55,700 రు॥లు ఖర్చు అవుతుంటే మొత్తం establishment మీద 60,400 రు॥లు మాత్రమే ఖర్చుఅవుతున్నది. ఈ ఒక్కరంగంలోనే సోషలిజం ప్రవేశిస్తుందని నేను ఆశించలేను. కాని ప్రత్యేకించి సోషలిజం గురించి మాట్లాడుతున్న మన ప్రభుత్వంవారు జీతాల విషయాలలో

ఉన్నటువంటి పరిస్థితులను పునరాలోచన చేయాలని కోరుతున్నాను, మొత్తం staff కంటె ఆఫీసరుల జీతాలు మొత్తం ఎక్కువగా ఉన్నది. కాబట్టి దానివల్ల ప్రయోజన మేమైనా ఉన్నదా అనే విషయం కూడా ఆలోచించుదాము. District power schemes గురించి audit report లో " ఇప్పటికి వీటిమీద పెట్టిన మొత్తంపెట్టుబడిలో 45% loss ఉన్నదని " చెప్పారు. ఈ కారణాల నుదహరిస్తూ execssive supervision charges అయినాయని కూడా వారు స్పష్టంగా చెప్పారు. ఇంత మంది అధికారులున్నప్పటికీ supervision charges పెరగడం తప్ప అందులో ఉన్నటువంటి లోటుపాట్లను సరిదిద్దుకొనే పరిస్థితి లేదు. " అవసరమైన వస్తువుల నన్నింటికీ immediate గా order చేయాలని కోరడం, వచ్చినటువంటి సరుకును సరిగా వినియోగించుకోలేక ఇతర ప్రాంతాలకు పంపడం జరుగుతున్నది. అందువల్ల ఖర్చులు పెరిగిపోతున్నాయని " కూడా చెప్పారు. ఇదివరకు ఒక్క electric pole కు ఎంతడబ్బు అవుతున్నదనే విషయం ఆంధ్ర అసెంబ్లీలో వచ్చిన సందర్భంలో,ఒక్కొక్క pole కు దాదాపు75 రు॥లు ఖర్చుఅవుతున్నదని శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డిగారు తెలియజేశారు. కాని150 రు॥ల వరకు ఖర్చుచేయబడుతున్నట్లు చాలాసందర్భాలలోస్పష్టమౌతున్నది.ఈవిధంగా ఖర్చులు తీవ్రంగా పెరిగిపోతున్నాయి. ఖర్చులు పెరగడం మాత్రమే కాదు. Stores లో జరిగే గలభా జాస్తిగా ఉంటున్నది. ఒకప్పుడు సింహాచలం stores లో రు. 40,000ల విలువగల సామాగ్రి అపహరించబడినది. ఈ రాగితీగను దొంగిలించినవారిని పోలీసులు సరుకుతోసహా పట్టుకొని తీసుకువస్తే అక్కడ ఉన్నటువంటి supervisor "ఇది మా సరుకు కాదు" అని త్రిప్పి వేయడంజరిగింది. దానిని మళ్ళా Assistant Engineer రుజువుచేసినప్పటికీ కూడా ఏమి చర్యతీసుకున్నారో ఇంతవరకూ స్పష్టంగా తేలలేదు. అంతేకాదు, ఈవిధంగా నష్టబోయిన సరుకు తిరిగి వచ్చేందుకు ప్రయత్నం చేసినవారికి promotion నిలిపివేయబడింది. దొంగతనం బయటపడకుండా వుంచడానికి ప్రయత్నం చేసినవారికి promotion వచ్చింది. దొంగతనం పట్టుకొనేందుకు ప్రయత్నించినవారికి promotion ఆపు చేయడమేకాకుండా క్రిందికి నొక్కేసినట్లుకూడా తెలుస్తున్నది. ఈ విషయం మంత్రిగారు గమనించాలని కోరుతున్నాను.

విజయవాడ వద్ద ఒక electrical stores ఉన్నది. దానిని మార్చుటకు Chief Engineer గారు ప్రయత్నంచేశారు. గుణదల వద్ద వారు కొన్నటువంటి భూమి ఉన్నది. చవకగా కొనియుంటారు. దానిని ఎక్కువ ధరకు ప్రభుత్వానికి అమ్మకంచేసే అవకాశం కల్పించుకోవాలని, విజయవాడలో ఉన్న stores ను 6 మైళ్ళు దూరంలో ఉన్న ఒకచోటికి ప్రత్యేకంగా మార్చినట్లు తెలుస్తోంది. 1953-57 సం. ల మధ్యకాలంలో గుంటకల్లు, గూడూరు, గుణదల, సింహాచలం స్టోర్సులలో సుమారు 40 లక్షల రూపాయల విలువగల సామానులు

పోయినట్లు, దానిని సర్దుబాటుచేయడానికి ప్రభుత్వోద్యోగులు manipulate చేస్తున్నట్లు తెలుస్తోంది. ఇందులో నిజానిజాలను పరిశీలించేందుకు ప్రత్యేకంగా ఒక కమిటీని నియమించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

మాచ్ ఖండ్ ప్రాజెక్టుకు నాల్గయిదు generating sets పెట్టుటకు tenders పిలిచినప్పుడు జపాన్ నుంచి వచ్చిన కంపెనీ చాలా lowest tender యిచ్చినా కూడ దానిని నిరాకరించి. ఈ విషయంలో discriminate చేసి, ప్రత్యేక కారణాల వల్ల Crompton Company కే అట్టి అవకాశం కల్గించారని తెలుస్తోంది. ఇట్లా ఎందుకు చేశారో మంత్రిగారు ప్రత్యేకంగా పరిశీలన చేయాలని కోరుతున్నాను. ఈ ఆరోపణలన్నీ స్పష్టంగా చెప్పడం నాకు ఇష్టంలేదు. కాని Crompton Company లో ఉన్న Chief Engineer తాలూకు బంధువర్గంవారు ప్రముఖ ఉద్యోగస్థానాలలో ఉన్నట్లుగా తెలుస్తోంది. ఈ మేరకు, ఆ మేరకు ఎంతవరకు సంబంధ ముంటుందో ప్రభుత్వంవారు గమనించవలసి ఉంటుంది. ఈ సందర్భంలోనే ఇంకొక ముఖ్యవిషయం మనవిచేస్తున్నాను.

1952 వ సం. లో కాంగ్రెసు మహాసభ హైదరాబాదు నగరంలో జరిగింది. అప్పుడు electric poles చాలవరకు Electricity Department ద్వారా ప్రభుత్వంవారు సప్లయిచేశారు. సుమారు 60 fans, 300 tube lights, different voltages గల 12 వేల bulbs, zinc sheets, ఇవన్నీ సరఫరాచేసినట్లు తెలుస్తోంది. ఇందువల్ల కనీసం 40, 50 వేల రూ. ల వరకూ ప్రభుత్వం నష్టపోయింది. కాని, ఆ డబ్బు కాంగ్రెసు పార్టీ తరఫునుంచి వస్తుందని ఆశించడం, అది యింతవరకు రాకపోవడం జరిగింది. ఇట్టిపరిస్థితులలో దానిని write off చేయడానికి ప్రయత్నం చేస్తున్నట్లు తెలుస్తోంది. ఇది ఎంతవరకూ నిజమో మంత్రిగారు వారి సమాధానంలో స్పష్టంగా తెలియబరచాలని కోరుతున్నాను. Chief Engineer కు సంబంధించిన అఫీసులన్నీ హైదరాబాదులోనో, కర్నూలులోనో ఉండవలసిన పరిస్థితులలో ఆ విధంగా జరగడంలేదు. Administration Section మట్టుకు మద్రాసు నగరంలోనే ఉంటున్నది. దీనికి కారణం తెలియదు. అందులో మొత్తం 30 లేక 35 మంది ఉద్యోగులుంటారు. వారికి కావలసిన ఆఫీసులు, బసలు, ఇతర సౌకర్యాలు ఇక్కడ దొరకకపోవు. మద్రాసులో ఉండడంవల్ల ప్రత్యేకంగా T.A. లు ఎక్కువవుతున్నాయి.

*Sri V. K. Naik (Sultan bazar)* : The electricity supplied at the time of the Congress Session was to maintain law and order; and they have not helped particularly Congress Session Committee. They supplied current there, and from that, we had drawn a line for our consumption.

శ్రీ బి. శ్రీరామమూర్తి : కాంగ్రెసు మహాసభను గురించి వారుచెబుతున్నట్లయితే దానికిసంబంధించిన భోగట్టా నాదగ్గరఉన్నది. అదినిజమో, కాదో మంత్రిగారే తెలియజేస్తారు. 1952 వ సం॥లో కాంగ్రెసు మహాసభ జరిగిన కాలంలో ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటువారు సౌకర్యాలు కలిగించి చాలాడబ్బు నష్టపోయారు. ఇదిఎంతవరకు నిజమో మంత్రిగారు తెలియబరచాలని కోరుతున్నాను.

Administration section అయిన C. E. Office మద్రాసునగరంలో ఉండడంవల్ల మన ప్రభుత్వానికి విపరీతమైన వ్యయం కలుగుతున్నది. వేరే రాష్ట్రంలో ఉండడంవలన రోజువారీ భత్యం ఎక్కువ ఇవ్వవలసి ఉంటుంది. ఈ విషయం మంత్రిగారు తెలియబరుస్తారను కుంటాను. నెలకు ప్రత్యేకంగా trunk calls కోసం 4,200 రు॥ల వరకు ఖర్చు అవుతున్నట్లు తెలుస్తోంది. ఆఫీసులు దగ్గరగా లేకపోవడంవల్ల పొదుపులేకుండా నష్టంకలిగే పరిస్థితులున్నాయి.

ఈమధ్యన 'మాచ్ ఖండ్ ప్రాజెక్టుదగ్గర 3 generating sets రెండవ పంచవర్ష ప్రణాళిక మొదటిసంవత్సరంలో ప్రారంభించబడాలని' చెప్పారు. కాని అక్కడ installations తగలబడిపోయినాయనీ, 50, 60 వేల రు॥లు ఖర్చుచేసి మరామతులు చేయించినప్పటికీకూడా అవిబాగుపడలేదని తెలిసింది. ఇట్టిపరిస్థితి ఎప్పటికి తీరుతుందో తెలియుటలేదని తెలుస్తోంది. నెల్లూరు power house లోనూ, మాచెర్లవద్దనున్న generators కూడా, బందు అయిపోయినట్లు, నాగార్జున సాగర్ ప్రాజెక్టు ప్రాంతంలో అక్కడిప్రజలు చీకటిలోనే ఉండవలసిన పరిస్థితి కలిగినట్లుకూడా తెలుస్తోంది. ఈపరిస్థితుల నన్నింటిని ప్రభుత్వంవారు విచారణచేసి, అది ఎంతవరకు నిజమో తిరిగి శాసనసభ్యులముందు ఉంచాలని కోరుతున్నాను. ఈపరిస్థితులయొక్క నిజానిజాలు తెలుసుకునేందుకు Superintending Engineer మొదలైన అధికారులతో మంత్రిగారు వేరువేరుగా చర్చించి వారిద్వారా విషయాలను తెలుసుకొనడానికి ప్రయత్నం చేయాలని కోరుతున్నాను.

ప్రతినెలాఖరున జరిగే Electrical Superintending Engineers సమావేశాలు కర్నూలులో జరుగుతున్నట్లు తెలుస్తున్నది. అవి హైదరాబాదులో జరిగినట్లయితే మంత్రిగారు ప్రత్యేకించి వారందరితో మాట్లాడి, విషయాలను తెలుసుకునేందుకు అవకాశం కల్గుతుందని మనవి చేస్తున్నాను.

మాచ్ ఖండ్ ప్రాజెక్టులోని workers పరిస్థితులను మంత్రిగారు పునరాలోచన చేయాలని కోరుతున్నాను. ప్రాజెక్టులో పని పూర్తి కాకపోయినప్పటికీ, ఇంకా చేయవలసిన పని ఉన్నప్పటికీ కూడా workers ను retrench చేయడం

జరిగింది. Rainy season లో కూడా ఈ ప్రాజెక్టులో పని ఆపుజేయని పరిస్థితులలో 5,000 మంది కార్మికులకు retrenchment orders ఎందుకు యివ్వవలసి వచ్చినదో నాకు అర్థంకావడంలేదు. Retrench చేసేటప్పుడు workers యొక్క seniority దృష్టిలో పెట్టుకొని చేయలేదు. తిరిగి పని ప్రారంభించేటపుడు retrench చేయబడిన వారినే seniority ప్రకారం తీసుకోవాలని అక్కడ retrenched people కోరుతున్నారు. అందుకు కూడా ప్రభుత్వం అంగీకరించినట్లు కనబడుటలేదు. Industrial disputes Act కు వ్యతిరేకంగా ప్రభుత్వమే సంచరించు చున్న పరిస్థితులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఈమధ్యన ప్రసిడెంటుగారు జారీ చేసిన Ordinance యొక్క spirit కు కూడా వ్యతిరేకంగానున్నట్లు కనబడుతున్నది. Industrial Tribunal క్రింద తగాదాఉన్న రోజులలో ప్రభుత్వం వీరందరిని retrench చేయడానికి ప్రయత్నంచేసి కార్మికుల పొట్టకొట్టే పరిస్థితి సరికాదని, భావ్యంకాదని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. తాము నిర్మించిన చట్టాలనే ప్రభుత్వంవారు వ్యతిరేకిస్తున్న పరిస్థితులలో ప్రయివేటు పెట్టుబడిదారులు ఏవిధంగా చేస్తారో ప్రభుత్వం గమనించవలసి వుంటుంది. కార్మికులకు ఇంకా ఆ ప్రాజెక్టులో చాలాపనిఉన్నది. ప్రస్తుతమున్న కార్మికులనందరిని తప్పించి contract labour కు పని ఇస్తున్నారు. Contractors కు స్థానం కల్పించడం ప్రభుత్వోద్దేశం. ప్రత్యేకంగా contractors కు పని కల్పించడానికి ప్రభుత్వం ఎందుకు పూనుకోవాలో నాకు అర్థంకాకుండాఉన్నది. Contract labour కు పని యిచ్చినట్లయితే cheap గా ఉంటుంది అంటారు. ఏ రకంగా cheap గా వుంటుందో నాకు అర్థంకాదు. చట్టం ప్రకారం local గా యిచ్చే rate ను contract labour కు ఇవ్వవలసి వుంటుంది. అందువల్ల అది cheap గా ఉండదు. Agency ప్రాంతంలో, అడవి ప్రాంతంలో, మలేరియా ఎక్కువగా ఉండే చోట్ల కష్టపడి పనిచేసిన కార్మికులను ఉద్యోగాలనుంచి తొలగించి, ఈ మధ్యన అన్ని సౌకర్యాలు ఏర్పడిన తరువాత వచ్చిన కార్మికులకు అవకాశం కల్పించడంలో ప్రభుత్వోద్దేశమేమిటో స్పష్టంగా తెలియుటలేదు. Technical side న చూచినట్లయితే contract labour ను పెట్టిన తరువాత ప్రభుత్వానికేమీ ఖర్చులు తగ్గలేదు. దానిపైన ప్రభుత్వంవారి supervision తప్పకుండా ఉండాలి. Supervision క్రింద అయ్యే ఖర్చులు తప్పవు.

Un-skilled labour అనేది Contract labour క్రింద ఉంటుంది. కాబట్టి supervisory staff ను తీసివేసే అవకాశం లేదు. కాబట్టి ఈ రూపేణా కొంత economy వస్తుందని ప్రభుత్వంవారు భావించేందుకు అవకాశంలేదు.

సామాన్యంగా ప్రస్తుతం ఉన్న casual labour కు బాధ్యతాయుతంగా ఉండే అవకాశంలేదు. ప్రస్తుతం ఉన్నవారిమీదమాత్రం హెచ్చు కంట్రోలు వుండే అవకాశం ఉంది. దానివల్ల quarters యిచ్చే పరిస్థితి కల్పించడం కష్టం అంటు

న్నారు. నిజంగా పనిచేసే కార్మికునికి కావలసిన గృహవసతి కల్పించకుండా వానిని ఉద్యోగంనుంచి, వృత్తులనుంచి తొలగించాలని ప్రయత్నించడం ఏమి సబబో నాకు అర్థంకావడం లేదు. ఈ విధంగా ప్రభుత్వమే చేసినట్లయితే ఇక ప్రయివేటు పెట్టుబడిదార్లు యేవిధంగా కార్మికులను చూస్తారో, పరిశీలింపవలసి యుంది. Industrial Disputes Act కార్మికులకు వర్తించదు అంటున్నారట. ఇది ఏ విధంగా సమంజసం ? ఈ విధంగా ఇదివరకు retrench చేసిన కార్మికులకందరికి సీనియారిటీ కల్పిస్తూ, శీలేరు, నాగార్జున సాగర్ వంటి ప్రాజెక్టు పనులకు తిరిగి వారిని పంపించాలని, నేను ప్రభుత్వాన్ని మరల కోరుతున్నాను. అదే విధంగా రామగుండం పవర్ థర్మల్ స్టేషన్ ఉంది. అక్కడ 15 సంవత్సరాల క్రిందట పని ప్రారంభించినప్పటికీ, యిప్పటివరకు పని పూర్తి అయినట్లు కనబడదు. మంత్రిగారుకూడా ఇదే విషయాన్ని సెలవిచ్చారు. కనుక దీన్నిగురించి పూర్తిగా research చేయవలసి యున్నది. అనకాపల్లిలో ఉన్న Electrical Corporation ను nationalise చేస్తామని చాలాకాలం నుండి చెప్పడమే తప్ప దానినిగురించి పని జరుగుతున్నట్లు కనబడడంలేదు. కనుక ప్రభుత్వంకు నేను తెలిపిన విషయాలన్నింటినీ తిరిగి ఆలోచిస్తుందని, వీటికి సమాధానాలు వినే అవకాశం కలుగుతుందని ఆశిస్తున్నాను.

*శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి (నెల్లూరు) : అధ్యక్షా, మన ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత విద్యుచ్ఛక్తి సరఫరా చాలావరకు అభివృద్ధి చెందిందని చెప్పవచ్చును అయితే ఈ అభివృద్ధికి తగినట్లు ఖర్చుకూడా మితంగా ఉందా; లేదా అనేది మాత్రం కొంత సందేహమైన విషయం. పూర్తిగా పైనుంచి క్రిందివరకు ఉద్యోగులందరూ శ్రద్ధగా పనిజేస్తున్నా, దీనిలోమాత్రం కొంత ఖర్చు జాస్తిగానే అవుతున్నదని నేను అనుకొంటున్నాను. క్రిందటి Budget session లో (Kurnool లో) నేను ఈ విషయంగురించి కొంతవరకు మాట్లాడాను. మరియు అప్పుడు Leader of the Congress Party; Leader of the House అయిన శ్రీ గోపాలరెడ్డిగారికి వ్రాతమూలకంగా కొన్ని విషయాలు యిచ్చాను. ఇప్పటికి 1 సం. 4 మాసాలైనది. ఇంతవరకు ఆ విషయమై ఏమి చేసినారో మాకు తెలియలేదు. అటువంటి విషయాలే కొన్ని శ్రీరామమమూర్తిగారు మాట్లాడుతూ చెప్పారు.

చోడవరం తాలూకాలో మొదట కొంత copper wire పోవడం, దానిమీద Sub-Magistrate Court లో కేసుపెట్టడం జరిగింది. మొదట్లో గవర్నమెంటు ఉద్యోగస్థులు ఆ wire మాది కాదనడం, తరువాత అది గవర్నమెంటు సొత్తు అని ఋజువుకావడం, అందువలన గవర్నమెంటుకు hand over చేయడం జరిగింది. దానికి సంబంధించిన officer ఎవరు ? ఇది ఎలాపోయింది ? ఈ సంగతి నేను 1 సం॥ 4 నెలలక్రితం తెలియజేశానుగదా ! ఏమైనా విచారణ చేశారా ?

అప్పటినుంచీ ఏమి చేశారు ? అప్పుడు ఆ stores కు సంబంధించిన శ్రీ పేరిశాస్త్రి అనే వారికి ప్రమోషన్ కూడా వచ్చిందని నేను విన్నాను. చాలా copper wire గుటకాయస్వాహా చేసినందుకే ఈ ప్రమోషను యిచ్చినారేమో ! వారు బహుశ Chief Engineer ను కూడా మోసము చేసినట్లు నాకు తెలుస్తున్నది. ఆయన S. S. L. C. pass కాలేదు. కాని Chief Engineer కు S. S. L. C. pass అయినట్టుగా statement యిచ్చినట్లు కూడా నాకు తెలిసింది. Chief Engineer ను మోసంచేసి ఈ offiicer గవర్నమెంట్‌ను కూడా మోసం చేయ బోయిన సమయంలో అది ఎట్లాగో కోర్టులో చిక్కుకొని ఆ copper wire బయట పడింది. ఇదివరకు ఎలా అయితే మోసం చేయడం జరిగిందో అదేవిధంగా మరల Chief Engineerను మోసంచేసి Assistant Engineer నౌకరిని సంపాదించినట్లుగా తెలుస్తున్నది. కనుక యివన్నీ ముందు విచారించాలి. పరిపాలనలో నున్న లోపాలు గమనించి వారివారి తప్పులను తెలుసుకొని దండించకపోయినచో సాధారణంగా శ్రద్ధగా పనిజేసే చిన్న ఉద్యోగస్థులుకూడా "వాళ్ళు తప్పుచేసి హాయిగా సంపాదించుకుంటున్నారు. పైగా ప్రమోషన్సు వస్తున్నవి, నేను కష్టపడి పని జేసినా ఏమీలేదు. కనుక నేనుకూడా సంపాదిస్తాను" అని సామాన్యంగా అనుకోవడం జరుగుతుంది. ఈ విషయాలే కాకుండా యింకొక విషయంకూడా నేను యిదివరకు మనవి జేశాను. కొన్ని లక్షల రూ॥ ల ఖరీదుచేసే copper wire వైజాగ్‌లో దిగడం, అక్కడనుంచి వెంటనే మోహన్ బ్రదర్సుకు చేరినతరువాత మళ్ళీ కలకత్తాకు బుక్ చేయడం, వెంటనే కొంతమంది గవర్నమెంటు ఉద్యోగస్థులకు తెలిసి పట్టుకొని ఆపివేయడం కూడా జరిగింది. దీనికి సంబంధించిన రాజారావు గారిని 4 రోజులు suspension లో పెట్టారు. అది చాలా సంతోషించవలసిన విషయం. మన ఆంధ్ర రాష్ట్రం వచ్చిన తరువాత అనగా మద్రాసు రాష్ట్రంనుండి విడిపోయిన తరువాత Electricity లో చాలా అభివృద్ధిని సాధించాం. ఇదిమాత్రం గర్వించవలసిన విషయమే. ఇదివరకు ఈ విషయాలన్నీ సమగ్రంగా, వ్రాతమూలకంగా మంత్రివర్యులకు తెలియబరచినాను. "మీ ఉత్తరంలో సంగతుల ప్రకారం ఈ పని జరిగింది. ఇది జరగలేదు" అనే విధంగానైనా మాకు జవాబులు యిస్తూఉంటే మేము కూడా యిటువంటి విషయాలన్నీ కనుక్కొని ప్రభుత్వదృష్టికి తేవడానికి కొంత ఆస్కారం ఉంటుంది. ఒకవేళ మేము ఆ విధంగా కనుక్కొని తెలియబరచినప్పటికీ ప్రభుత్వం ఆవిధంగా అణచిపెట్టినప్పుడు మేము ప్రయత్నించికూడా లాభంలేదు. ఈ Offiicers తో లేనిపోని విరోధం తెచ్చుకోవడమెందుకు ? Officers తో విరోధం లేకపోతే మా పనులు కూడా సక్రమంగా జరిగిపోతాయి అనే అభిప్రాయం ఏర్పడుతుంది. కనుక ఇకనుంచైనా ప్రభుత్వం సభ్యులు ముఖ్యమైన సంగతులను వ్రాతమూలకంగా తెలిపినప్పుడు వాటికి వెంటనే జవాబిస్తారని ఆశిస్తున్నాను.

మాజిల్లాకు సంబంధించి, పోయినసంవత్సరం బడ్జెట్‌లో ప్రతిస్కీముకు ముందు 100 రూ.లు వేసినారు. ఈ సం. Budget లో కూడా 100 రూ.లు వేశారు. ఇక వచ్చే సం. లో కూడా 100 రూ. లు వేస్తారేమో! సాధారణంగా ఈ Schemes అన్ని sanction చేసేప్పుడు 15, 20 లక్షల రూ. ల schemes ఒకేదఫా sanction చేయకుండా ఈ sanction చేసిన schemes 1st, 2nd, 3rd phases లో పూర్తిచేస్తే బాగుంటుంది. లేకపోతే అది sanction అయినట్లు పేపర్లలో పడుతుంది. అక్కడి ప్రజలు sanction అయిన తరువాత కూడా పనికాలేదే అని విచారపడతారు. మా గూడూరులో ఒక store ఉండేది. అందులో ఉన్న సామానంతా ఎక్కడో పని జరుగుతున్నచోటికి వెళ్లిపోతున్నది. అక్కడి ప్రజలంతా ఒకటి, రెండు schemes sanction అయినట్లు మేము paper లో చూచాం, మా సామానంతా హైదరాబాదు తీసుకుపోతున్నారేమో, మంత్రిగారు హైదరాబాదు మంత్రిగారు అయిపోయారు'' అనుకుంటూంటారు. అప్పుడప్పుడు మావద్దరకువచ్చి మనకు sanction అయిన schemes అన్నీ యేమైనవని అడుగుతున్నారు.

కొత్తగా ప్రభుత్వం స్కీములను శాంక్షన్ చేసే విషయంలో ఆ స్కీములను వెంటనే ప్రారంభించేటట్లు చూడాలి. ఒక సంవత్సరం కొన్ని స్కీములను శాంక్షన్ చేసినట్లయితే ఆ స్కీము లన్నింటినీ తప్పకుండా ప్రారంభించేటట్లు చేయాలి. డబ్బు హెచ్చుగా లేని పక్షంలో మొదటి సంవత్సరం కొంత, రెండవ సంవత్సరం మరికొంత ఖర్చుచేసుకుంటూపోతే ప్రజలకు సంతోషంగా ఉంటుంది. డబ్బు శాంక్షన్ చేయనిదే పని ప్రారంభంకాదనే విషయం ప్రజలకు తెలియదు. స్కీము శాంక్షన్ అయినదని వారు పేపర్లలో చూస్తారు. ఆ విషయాన్ని పేపర్లలో వేయకుండాఉంచేనే చాలా బాగుంటుంది. కాని పేపర్లలో వేస్తారు. ఈ విధంగా వేయడంవల్ల స్కీములు ప్రారంభమవుతాయనే ఆశ ప్రజలలో కలుగుతుంది. కాని ఎంతకాలానికి పని ప్రారంభంకాకుండాఉండడంవల్ల ప్రజలకు సమాధానము చెప్పడం యం. యల్. ఏ. లకు కష్టంగా ఉంటున్నది. కాబట్టి శాంక్షన్ చేసిన స్కీము లన్నింటికినీ యీ సంవత్సరం కొంత, వచ్చే సంవత్సరం కొంత ఖర్చుపెట్టినట్లయితే ప్రజలకు ఉత్సాహంకలుగుతుంది. ఈ స్కీములకుగాను కేటాయించిన మొత్తాన్ని అన్ని స్కీములకు డిస్ట్రిబ్యూట్ చేస్తే బాగుంటుందని నా అభిప్రాయము. నిన్న ఒకమిత్రుడు మాట్లాడుతూ ఒక విషయాన్ని చెప్పారు. అది ఎంతవరకునిజమో మంత్రిగారు కనుగొంటారని అనుకొంటాను. ఆంధ్ర రాష్ట్రం ఉన్నప్పుడు ఐదున్నరకోట్ల రూపాయలకు సామానులను కొనడానికి ఫారన్ కంట్రీస్‌లో ఆర్డరు ప్లేస్ చేసినట్లు అయితే నాల్గున్నరకోట్ల రూపాయల విలువగల వస్తువులే వచ్చి ఒక కోటి మాయమయిపోయినదని అనుకొంటున్నారు. అబీద్ బజారు గజెట్ అనే పత్రిక ఒకటున్నది. అది మా హాస్టలుకు వస్తుంది అప్పుడప్పుడు.

మిస్టర్ స్పీకర్ : ఏదో బజారుగజెట్‌లోని వార్తలను గురించి చెప్పడం మంచిదికాదని తెలియచేస్తున్నాను. ఆ విషయం మీ పార్టీలో చెప్పుకోండి. కాని, అసెంబ్లీలో చెప్పవద్దు.

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం) : వారేదో చెబుతూంటే దానిని పార్టీలో చెప్పమనడం న్యాయమా ?

మిస్టర్ స్పీకర్ : బజార్ రూమర్లను చెప్పవద్దని అంటున్నాను.

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి : బజారు రూమర్సు కాకపోతే నాకు తెలిసిన విషయాలేచెబుతాను. నాకు తెలిసినవిషయాలుచెప్పడం ధర్మం. ఒకరూపాయో, రెండు రూపాయలో ఇమిడిఉన్న సమస్యకాదు ఇది. ఐదున్నరకోట్ల రూపాయలకు సామానులు రావలసిఉంటే వాటిలో నాల్గున్నరకోట్ల రూపాయలకే సామానులు వచ్చి ఒక కోటి రూపాయలు మాయమైపోయినవని అనుకొంటున్నారు. దీనిలో నాన్ అఫిషియల్సుకుకూడా హేండు ఉన్నదని నాకు వినికిడివల్ల తెలుస్తున్నది. ప్లానింగు కమిషన్‌వారు కూడా అబ్జక్టు చేసినట్లు కూడా తెలుస్తున్నది. దీనిలో నిజము ఉన్నట్లయితే ఇదొక పెద్ద కాన్‌స్పిరసీ అని నా అభిప్రాయము. ఆ కాన్‌స్పిరసీని వెంటనే ఎంక్వైరీ చేయించి నిజముగా లోపముంటే దానిని బయటకు తీసుకొనిరావలసిఉన్నదని మనవి చేస్తున్నాను. అదే విధముగా నేను ఇంతకుముందు చెప్పిన విషయములలో—కాపరును కలకత్తాకు పంపించే విషయంలో కాని, సబ్ మాజిస్ట్రేటు కోర్టులో ఉన్న కేసు విషయంలో కాని—ఏ ఏ ఉద్యోగులు ఇమిడిఉన్నారో విచారించమని కోరుతున్నాను. ఒక్క స్టోర్ కీపర్‌కే కాదు, చాలామంది ఆఫీసర్సుకు దీనితో సంబంధం ఉంటుందేకాని వేరు కాదు. దానిని కప్పిపుచ్చటానికి వీలులేదు. దానినంతా ఎంక్వైరీచేసి దానితో సంబంధమున్న ఆఫీసర్సునందరినీ పనిచేస్తేనేకాని బడ్జటు లోటు పూడ్చుకోటానికి ఆస్కారం ఉండదు. అటువంటివారిని పనిచేసినప్పుడే యీ స్కీముల విలువలను తగ్గించుకోగలము. ఆ విధంగా బడ్జటులోటును భర్తీచేసుకోటానికి ప్రయత్నించగలము.

. . . . . . .

శ్రీ జి. పరంధామయ్య (పొన్నూరు) : అధ్యక్షా, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి గా. శ్రీ నరసింగరావుగారు యీ సంవత్సరం ఎలెక్ట్రిసిటీ స్కీములకుగాను మన ప్రభుత్వం ఎంతమొత్తము ఖర్చుచేయదలచినది ఏరకంగా ఆ స్కీములను అమలుజరుపబోతున్నదీ విశదముగా తెలవిచ్చారు, అయితే గ్రామములమీద మన ప్రభుత్వం చాలాచిన్నచూపు చూచుచున్నట్లుగానే భావించి ఆ డిమాండుకు వారు కేటాయించినటువంటి మొత్తానికి తీవ్రంగా అసంతృప్తి తెలియచేస్తూ గ్రామములతరపున వారియొక్క ఇబ్బందులను గురించి నేను స్వల్పముగా

మనవిచేయ దలచుకున్నాను. ద్వితీయపంచవర్ష ప్రణాళిక క్రింద ఎలెక్ట్రిసిటీ స్కీములకుగాను మనము ఖర్చుపెట్టనున్నటువంటి విషయములలో ఒక పాలసీ పెట్టుకొని యీ స్కీములను కమర్షియల్ బేసిస్‌మీద అమలు జరుపవలెనని, 10 శాతము రిటరన్ వుంటేనేగాని యీ స్కీములను అమలు పరచరాదని అనుకొని లోగడ మన ప్రభుత్వం అలాగేచేసినది. ఐతే మనకు ప్రభుత్వంవారు అందజేసినటువంటి అంకెలను చూస్తే ఒక విషయము మనకు తేటతెల్లముగా కన్పడుతుంది. అదేమంటే 1-10-1953 వరకూ 13 కోట్ల 57 లక్షలను మనము విద్యుచ్ఛక్తి స్కీములపై ఖర్చుపెట్టినప్పుడు 83 లక్షల రూపాయలు రిటరన్ ఏటేటా వచ్చుచుండేవి. దరిమిలా 31-3-56 వరకూ 31.53 కోట్లు ఖర్చుపెట్టగా 1.68 కోట్ల రూపాయలుమాత్రమే మనకు రిటరన్ వచ్చినది. ఈ ఫిగర్సునుబట్టి చూస్తే 10 శాతము రిటరన్ రావలెననే మన ప్రభుత్వము యొక్క పాలసీ ఏరకంగా పాటింపబడకుండా ఉంటున్నదో మనము గమనింప వలసిఉన్నది. మనకు రావలసినటువంటి 10 శాతము రిటరన్ అనేది 3.53 కోట్లు ఉండవలసిఉన్నది. కాని, 1.68 కోట్లు మాత్రమే వచ్చింది. ఇలా ఎందుకు తక్కువవచ్చినది అనే ప్రశ్నకు జవాబు విశదముగా మంత్రిగారు చెప్పవలసిఉన్నది. ఇప్పటికి అమలుజరిగినటువంటి ఎల్కక్ట్రిసిటీ స్కీమ్సు అన్నియు కూడా ఒక రీజినల్ బేసిస్‌మీద వెనుకబడిన ప్రాంతములనేపేరుతో రెమ్యూని రేటివ్‌గా లేకపోయినా ఎగ్జిగ్యూట్ చేసినందువల్లనే ఇంతతక్కువగా రిటరన్ వస్తున్నదని తేటతెల్లమవుతున్నది. ఐతే ఎందువల్ల యీరీతిగా చేయవలసివచ్చినదో అర్థముకాదు. ముఖ్యముగానాలుగైదుకోస్తాజిల్లాలలోనూ విద్యుచ్ఛక్తిరైతులకు చాలా ఉపయోగపడుతున్నది. ఆవిధముగా ఎలెక్ట్రిసిటీ ఉపయోగపడే ప్రాంత ములలో ఎలెక్ట్రిసిటీని ఇవ్వకుండా ఎక్కడో వెనుకబడిఉన్న ప్రాంతాలనే పేరుతో రెమ్యూనిరేటివ్‌గా లేకపోయినా ఎవరో కొందరుమాత్రము ఉపయో గించుకొనుటకుగాను విద్యుచ్ఛక్తిని సరఫరా చేయుటకుగాను స్కీమ్సును శాంక్షన్‌చేసి యీ విధముగా దుబారాగా ఖర్చుపెట్టడం శ్రేయోదాయకం కాదని నేను మనవిచేస్తున్నాను. ఈ ప్రభుత్వం ఎలెక్ట్రిసిటీ స్కీములవల్ల డబ్బు సంపాదించవలెనంటే మన గ్రామములలోనున్నటువంటి ప్రజలకు మేలుకలుగ వలెనంటే వారికి వెంటనే అవసరమున్నచోట్ల విద్యుచ్ఛక్తి సరఫరా చేయవలసి ఉన్నది. గ్రామములలోని ప్రజలమీద మనము వేసినటువంటి పన్నులకు వారు అసంతృప్తిచెంది ఉన్నారు. ఎంతో తీవ్రంగా నిర్లక్ష్యభావంతో మనలను చూస్తున్నారు. ప్రభుత్వం యీవిధంగా మామీద శీతకన్ను వేసినదని మామీద హెచ్చు పన్నులు విధిస్తున్నారని మాకు ఉపయోగకరమైన పనులను చేయడం లేదనీ గగ్గోలుపెడుతున్నారు. కమర్షియల్ అండర్‌టేకింగ్సువలె పరిగణిస్తామని ఒక పాలసీని పెట్టుకొని చేస్తున్నటువంటి యీ ఎలెక్ట్రిసిటీ స్కీమునైనను వారికి అందజేయలేకపోవడం వారి శక్తిసామర్థ్యములను శంకించడంమాత్రమే

అవుతుంది. ఇది చాలా శోచనీయమని నేను భావిస్తున్నాను. కాబట్టి ప్రభుత్వం వారు ఎలెక్ట్రిసిటీ స్కీములను అమలు చేయటంలో అలాంటి ప్రాంతాలను దృష్టిలో పెట్టుకొని వాటికి వీలైనంతత్వరలో ఎలెక్ట్రిసిటీని అందజేయగలరని ఆశిస్తున్నాను. తాలూకా హెడ్ క్వార్టర్సుకు మాత్రమే ఎలెక్ట్రిసిటీని సప్లయి చేయగలమని మంత్రిగారు చెప్పిఉన్నారు. తాలూకా హెడ్ క్వార్టర్సుకే సప్లయి చేసినంతమాత్రముచేత అబస్తీలోనే ఉన్నటువంటివారికి ఎలెక్ట్రిసిటీని ఇచ్చినంత మాత్రముచేత గ్రామ ప్రాంతాలలోఉన్న ప్రజలను ఏ విధంగా సంతృప్తి పరచ గలము ? అనే విషయాన్ని ప్రభుత్వం గుర్తించాలి. మన ఆర్థిక మంత్రిగారైన గోపాలరెడ్డిగారు పన్నులు ఏవిధంగా వేదాము, ఎవరిమీద వేదాము, అదిమీరే చెప్పండని. ఆభావంగా సభ్యులమీద వేశారు.

లోగడ పన్నులను పల్లెప్రజలమీద వేసినారు. ఒక దఫాకాదు, రెండు దఫాలు కాదు, మూడు దఫాలు, 4 దఫాలు కూడా వేసినారు. Indirect గాను, direct గాను, మళ్లీ ఈమధ్యన కేంద్రప్రభుత్వంవారు కూడా, గోరుచుట్టు మీద రోకటిపోటు అన్నట్లు కొత్తపన్నులు విధించారు. ఈవిధంగా వారికి కొత్త పన్ను లను విధించేటటువంటిసందర్భాలను పురస్కరించుకొని, వారి విషయం దృష్టిలో పెట్టుకొని మనం ఇక్కడ చేసేటటువంటివ్యవహారాలలో వారికి ఏదైనా మేలు కలుగజేసేదానికి పాటుపడాలి గాని వారి మీద శీతకన్ను వేసినట్లుగా మీకు తాలూకా headquarters లో మాత్రం electricity ఇస్తాము, మీకు పల్లెటూళ్లలో electricity లేకపోతే మాత్రం ఏమి, మీరు దానిని ఉపయోగించుకోవడంలేదు, అనేటటువంటి నెపంతో ఇక్కడ అంకెల గారడీచేసి, పల్లెలను చిన్న చూపు చూడడం భావ్యంకాదని నేను మనవిచేస్తున్నాను. ముఖ్యంగా కృష్ణా,గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాలలో, అటు శ్రీకాకుళం, విశాఖపట్నంలోని వెనుకబడిన ప్రాంతాలలో కూడాను, పల్లెప్రజలు తమ పంచాయితీ బోర్డు ద్వారా, అవి major పంచాయితీకానివ్వండి, minorపంచాయితీకానివ్వండి, ఎన్నో schemesను గవర్నమెంటువారికి పంపించిఉన్నారు. వాటికి investigation కూడా జరిగింది. లోగడ ఉన్నటువంటి స్కీములను అన్నింటిని ఒక priority list ప్రకారం ప్రభుత్వంవారు అమలుపరచాలని సంకల్పించి, ఆ list నొకదానిని మన electricity department వారు తయారుచేసి ఉన్నారు. ఆ list గౌరవసభ్యులందరికి కూడ ఎందుకు గాను అందచేయలేదో మాకేమీ అర్థంకావడంలేదు. అలాంటి schemes ను అన్నిటిని కూడా వీలైనంత త్వరగా అమలుపెట్టవలసిందిగా కోరుతూ, ఇటు వంటి commercial undertakings తీసుకొనేటటువంటి ఈ ప్రభుత్వము తమ బాధ్యతను గుర్తించి ఎప్పటికప్పుడు ఈ సభ్యుల యొక్క సలహాలను తీసుకొని ఎవరికి ఏ ఏ ప్రాంతాలలో ఏమేమి జరుపుతున్నారో ఎవరికి ముందుగా వస్తాయి. ఎవరికి తరువాత వస్తాయి అనేటటువంటిది తెలియజేస్తే, ఆ యా ప్రాంతాలలో

होने के लेहाज़ से और वहां बडी Cotton Industry होने को देखते हुए उसके अभिउदय के लिये electricity जल्द से जल्द देना चाहिये। और जो स्कीम्स अपूरे रह गये हैं, उनको पहले लेना चाहिये। Cabinet में तेलंगाना एरिय के लोकप्रिय मन्त्री electricity के लिये रहने के बावजूद भी वह इस पर ध्यान नहीं दिये हैं। मैं उनसे request करता हूँ कि वह तेलंगाने की उन्नति के लिये सही तौर पर ध्यान दें और खास तौर पर आदिलाबाद के लिये कोशिश करें। निज़ाम सागर स्कीम से निज़ामाबाद डिस्ट्रिक्ट को पहले electricity supply होना चाहिये था, लेकिन वहां न दे कर हैदराबाद सिटी को देने की कोशिश कर रहे हैं। जहां तक मैं समझता हूँ यह मुनासिब नहीं है। concerned area को develop करने के बाद दूसरे एरिया को लेना चाहिये। वरंगल की भी यही हालत है। स्कीम्स एलाट करते वक्त जहां Industries हैं उनको पहले preference देना चाहिये। और पहले District headquarters को लेना चाहिये। और उसके बाद Taluq headquarters को लेना चाहिये।

इन विचारों के साथ मैं अपना भाषण समाप्त करता हूँ।

*శ్రీమతి బి. రుక్మిణీదేవి (హిందుపూరు-రిజర్వుడు) : అధ్యక్షా, మంత్రి వర్యులు ప్రవేశపెట్టిన యీ డిమాండును బలపరుస్తూ కొన్ని మాటలు చెపుతున్నాను. ఈ డిమాండుక్రింద ఖర్చుపెట్టే స్వల్ప మొత్తము విస్తృత ఆంధ్ర ప్రదేశ్‌కు ఏమాత్రం చాలదు. మన రాష్ట్రము గ్రామ సముదాయము. ఈ గ్రామములు దారి, డొంకలు లేక, నీటిపారుదల సౌకర్యములు లేక, అన్ని విధాలా వెనుకబడి యున్నవి. నీటిపారుదల సౌకర్యములు లేని గ్రామములలో, చెరువులు, కుంటలు, బావుల మూలంగా గ్రామీణులు వ్యవసాయం సాగిస్తారు. కాని కొన్ని దశాబ్దాల తరబడి ఈ చెరువులు, కుంటలు మరమ్మత్తులు లేనందున వ్యవసాయమునకు నిరుపయోగపడుచున్నవి. నేటి మన పంచవర్ష ప్రణాళికలు గ్రామాభివృద్ధి ప్రాతిపదికగా రూపొందింపబడినవి. దేశానికి వెన్నెముకవలె యున్న యీ గ్రామములు దేశ సౌభాగ్యానికి మూలము. గ్రామములలో వ్యవసాయాభివృద్ధి జరిగి ఉత్పత్తి పెరుగవలెనన్న నీటిపారుదల సౌకర్యములు అత్యవసరములు. నేడు మనం నిర్మించుచున్న, నిర్మించదలచిన పెద్ద, చిన్న ప్రాజెక్టులు పూర్తిఅయి రైతులకు ఉపయోగపడుటకు కొన్నిసంవత్సరములు పట్టును. అంతవరకు ఉత్పత్తి నాపుటకు సాధ్యపడదు. ఈవిధముగా చేసిన దేశాభివృద్ధికి హానికరము. ఉత్పత్తి పెరుగుదలకు దోహదమిచ్చిన ప్రణాళికలకు విద్యుచ్ఛక్తి చాలా ప్రముఖస్థానమువహించుచున్నది. ఆర్థికమంత్రిగారు బడ్జటుఉపన్యాసము వలన విద్యుచ్ఛక్తి పద్దుక్రింద ఆదాయము పెరుగుచున్నటులు కనుపరచబడినది. కాబట్టి ఈ ప్రణాళికను త్వరితగతిని విస్తరింపజేయుట సమంజసము. కాని నేడు మన విద్యుచ్ఛక్తి ప్రణాళికలను పరిశీలించిన అన్నివిధముల వెనుకబడిన ప్రాంతములకు గాక, అన్ని సౌకర్యములు గల ప్రాంతములకు, విద్యుద్వేగమున ప్రవ

హించుచున్నది. రాయలసీమ వెనుకబడిన ప్రాంతమనునది సర్వజనాంగీకారము. ఈ రాయలసీమలో అనంతపురంజిల్లా ఎక్కువ వెనుకబడి యున్నది. నీటి పారుదల సౌకర్యములు పూర్తిగా తక్కువ. ఈ జిల్లాలోయున్న చిన్న చిన్న ప్రాజెక్టులు పెన్నారు, కుముద్వతి ప్రాజెక్టు, పేరూరు ప్రాజెక్టు, భైరవానితిప్ప ప్రాజెక్టు, తుంగభద్ర ఎగువకాలువ వల్ల జిల్లాలోని మడకశిర, పెనుగొండ తాలూకాలకు తప్ప, మిగతావాటికి కొద్దిపాటి నీటి పారుదల సౌకర్యములు చేకూరును. మడకశిర తాలూకా ఏ మాత్రం విద్యుచ్ఛక్తిగాని, నీటి పారుదల సౌకర్యములుగాని లేక చాలా వెనుకబడియున్నది. ఈ తాలూకాకు చుట్టూ తెలుగు మాతృభాషగా గల మైసూరు స్టేటు ప్రాంతములు వున్నవి. ఈ తాలూకాకు నీటిపారుదల సౌకర్యములు చేకూర్చవలెనంటే మైసూరు స్టేటునుంచి లభ్యపడవలసి యున్నది. గత 35 సం.ల నుంచి మైసూరు ప్రభుత్వంవారు నీటి పారుదల సౌకర్యములు ఆపివేసినందున, తాలూకాలో మరమ్మతులులేని చెరువులు నిర్జలములయినవి. దీనికి తోడు వర్షాభావము ఈ తాలూకాకు ఎక్కువ. అందువల్ల యిచ్చట రైతుల వ్యవసాయము బావులమీదనే ఆధారపడియున్నది. ఏతాములు ఉపయోగించి బావులలోని నీరు పంటపొలములకు పెట్టి పంటలు పండిస్తున్నారు. ఈ పద్ధతివలన పశువులకు, రైతులకు శ్రమ ఎక్కువ, పంటలు తక్కువ. వేసవికాలములో బావుల నీటిని తోడుటకు భగీరథప్రయత్నము చేయవలసియుండును. బావులద్వారా వ్యవసాయము సాగించు ఈ తాలూకాలో విద్యుచ్ఛక్తి ప్రణాళిక విస్తరించిన, కరెంటుద్వారా నడచు పంపుసెట్లు ఉపయోగించి బావుల నీటిని పంటపొలాలకు పెట్టి తక్కువ శ్రమతో ఎక్కువ పంట పండించగలరు ఈ తాలూకా చుట్టూ ఉన్న మైసూరు స్టేటు గ్రామాలలో విద్యుచ్ఛక్తి యున్నది. అచట రైతులు విద్యుచ్ఛక్తి నుపయోగించి తక్కువ శ్రమతో ఎక్కువ పంట పండించుట యీ తాలూకా ప్రజలు నిత్యమూచూస్తూ, ఎక్కువ శ్రమతో తక్కువ పంట పండించుచూ క్షామబాధకు గురియగుచున్నారు. ప్రభుత్వం యీ తాలూకాకు వెంటనే విద్యుచ్ఛక్తి పథకం అమలుపరచకుండుటను చూచి చాల నిస్పృహచెందియున్నారు. ఒకప్పుడు జిల్లాకు ఉద్యానవనమని పేరుగాంచిన యీ తాలూకా, క్షామదేవతకు నిలయమైనది. కాబట్టి బావుల ద్వారా వ్యవసాయము సాగించే తాలూకాకు తప్పకుండా వెంటనే మంత్రివర్యులు విద్యుచ్ఛక్తి ప్రణాళికను విస్తరింపజేయవలెనని అభ్యర్థించుచున్నాను. గత రెండు సంవత్సరములనుంచి, అనగా నేను శాసనసభ్యురాలుగా ఎన్నికైనప్పటినుంచి, తాలూకా పరిస్థితులు, విద్యుచ్ఛక్తి ఆవశ్యకత తెలుపుతూ ప్రభుత్వమును అర్థించితిని. గత బడ్జెటు సమావేశములో అప్పటి మంత్రిగారు యీ తాలూకాకు 19 లక్షల స్కీము మంజూర్ అయినట్లు తెలిపిరి. కాని ఎందువలననో, యీ స్కీము యింతవరకు అమలుపరచబడలేదు. మొన్న పార్లమెంటు ఎన్నికల ప్రచారము నిమిత్తము ముఖ్యమంత్రిగారు ఫిబ్రవరి ఆఖరు

వారములో మా తాలూకాలో పర్యటించిన సందర్భమున, యీ తాలూకాకు విద్యుచ్ఛక్తి వెంటనే విస్తరింపచేయబడగలదని హామీ ఇచ్చినట్లు అచ్చటి పెద్దలు మాతో చెప్పిరి. ఏప్రియల్ 13వ తేదీన మంత్రిగారివద్దకు అక్కడిపెద్దలు రాయబారమువచ్చి, మెమోరాండము సమర్పించిరి. ఎన్నో విధములుగా రాయబారములునడుపుతూ, తాలూకా కష్టపరిస్థితులను తెలుపుతూ, విద్యుచ్ఛక్తి అవశ్యకతను తెలుపుతూ ఉన్నప్పటికినీ, ప్రభుత్వము ఏమాత్రము శ్రద్ధవహింపకున్నది. ఇకఏవిధముగా చేసిన, మా కష్టపరిస్థితులు గుర్తించి ప్రభుత్వము శ్రద్ధవహించునో తెలియకున్నది. మంత్రివర్యులు మాప్రాంతమునకు క్రొత్తవారు. మాతాలూకా ప్రజల తరఫున వారిని మా తాలూకాకు ఆహ్వానించుచున్నాను. అక్కడి పరిస్థితులను స్వయముగా తిలకించి, ప్రజల విన్నపములను వినినట్లయిన, అక్కడి పరిస్థితులను కొంతవరకు అర్థము చేసుకొనగలరు. బడ్జెటు సమావేశములు ముగిసినతరువాత, నా ఆహ్వానమును తిరస్కరించకుండ, అంగీకరించి మా తాలూకాను తప్పకుండా దర్శించవలయునని మంత్రిగారిని ప్రార్థించుచున్నాను. ప్రజల కష్టములు తీరి, క్షామబాధతొలగి, వ్యవసాయ అభివృద్ధిజరిగి, తాలూకా సుభిక్షవంతము అగుటకు యీ తాలూకాకు వెంటనే విద్యుచ్ఛక్తి ప్రణాళికను విస్తరింపజేయవలెనని మంత్రిగారిని ప్రార్థిస్తూ, యీ అవకాశంఇచ్చిన అధ్యక్షుల వారికి ధన్యవాదములు అర్పిస్తున్నాను.

***श्री व्ही. के. नाईक** :—माननीय अध्यक्ष जी ! मन्त्री जी ने जो Demands रखे हैं, उनकी ताईद करते हुए हैद्राबाद और सिकंद्राबाद के Electric Board के सम्बन्ध में मैं कुछ सुझाव रखना चाहता हूँ ।

Electricity सारे Demands में महत्व रखती है । इसके महत्व का एक कारण नहीं अनेकों कारणों से इसको देखा जा सकता है । आज देश की परिस्थिति में यह उद्योग तथा कृषि विभाग के लिये अत्यन्त आवश्यक है । "Produce or Perish" "उत्पादन कीजिये या नाश्वन्त होजाइये" ऐसी परिस्थिति आज देश की है । हमको Produce करना है Perish होना नहीं है । इसके लिये आज अपनी planning में Electricity को महत्वपूर्ण विचार से देखने की आवश्यकता है यह मुझे नये तौर से नूतन रूप में मन्त्री जी को बतलाने की आवश्यकता नहीं है । यह हैद्राबाद सरकार के ज़माने में पूर्व मिनिस्टर मेलकोटे जी ने असेम्बली ही में अपने सम्भाषण में कहा था कि Electricity का concern "No profit no loss" बेसिस पर चलाया जायगा । मतलब यह था कि जैसे जैसे इसके उत्पादन में लाभ होता जायगा वह reserve या treasury के लिये नहीं होगा बल्कि वह consumers और उद्योग धन्दों की आवश्यकताओं को पूरा करने के काम में लाया जायगा । इसी Floor पर यह आश्वासन दिया गया था । ठीक है होना भी यही चाहिये । मगर आज हम देखते हैं कि क्या हो रहा है । Nizam Sagar Hydro-Electric Scheme पूरी हुई । उसके पश्चात् इसी हाउस से Rates बढ़ाए गये । ऐसे बढ़ाए गये कि इससे न तो consumers को फ़ायदा हुआ न उद्योग

धन्दों को। न Middle Class Industries को न Small Industries को न Large Scale Industries को इस से फ़ायदा हुआ। दो करोड़ रुपये खर्च हुए। १० लाख रुपये बियाज़ लगाया गया। इससे वहां १५ हज़ार cwt. उत्पादन हुआ थर्मल स्टेशन से पांच पांच हज़ार केलोवाट का प्रबन्ध हुआ। यह छुपी हुई बात नहीं है कि निज़ामसागर पर Hydro-Electric Scheme लिया गया गवर्नमेंट ने इसको स्पष्ट रूप से नहीं अस्पष्ट रूप से कहा कि यह गलती हुई। इस से हैंद्राबाद में रहने वालों को फ़ायदा नहीं हुआ। Rates और अधिक किये गये। आप industries पर ध्यान दीजिये। Industries तो Prosper हो ही नहीं रही हैं। जब इन में प्रगति नहीं होती है तो capital out lay चाहे वह private industry हो या Government Industry हो ज्यादा करना पड़ता है। Capital डालने पर भी Industries लाभदायक नहीं हो रही हैं तो Labour के कई Disturbances खडे होते हैं। इस तरह एक ओर लेबर Disturbances दूसरी ओर बाहेर के माल से competition यह सब देखने के बाद यह मालूम होता है कि जब तक electricity के rates cheap न करेंगे राष्ट्र को फ़ायदा न होगा और राष्ट्र में जब तक उत्पत्ति न बढेगी हम जिस तरह समाज का विस्तार और सुधार करना चाहते हैं वह कदापि न होगा। मैं उद्धारण के रूप में मन्त्रीजी की दृष्टि में लाना चाहता हूँ कि यहां Small Scale Industries और Medium Industries की पूर्व परिस्थिति क्या थी। Nizam Sagar में Hydro-Electricity Scheme पूरी होने के बाद केवल बारिश में पांच हज़ार cwt. पावर मिलता है। बारिश के बाद 3000 cwt. हो जाता है और जनवरी, फेब्रवरी, मार्च, एप्रेल में इससे कोई फ़ायदा मिलता ही नहीं। आज उद्योग धन्धों से कितना अधिक मिल रहा है मैं consumer numbers देकर बतलाऊँगा। Consumer No. 1640 पहले Rs. 3394–5–9 देता था आज वह Rs. 6581–10–0 देता है इस तरह वह Rs. 2187–4–3 अधिक दे रहा है। याने 100 to 200% हो गया है। मैंने एकउद्धारण दिया हैं इस तरह संख्या बढती जा रही है। आप उनसे रेट्स भी अधिकले रहे हैं, कम नहीं ले रहे हैं। 1955–56 में Rs. 444868–5–2 फ़ायदा हुआ। मैं Balance Sheet से actual figures दे रहा हूँ। यह मेरे ज़ाती फीगर्स नहीं हैं। यह रखम आप उद्योग धन्दों को बढाने के लिये या consumers के लिये नहीं दे रहे हैं। या पालिसी बतलाई गयी कि "no profit, no loss" के बेसिस पर चलाया जायगा। यदि आप यह चार लाख की बचत industries में distribute कर दें तो वह competetion में consumers के लिये अधिक produce कर सकेंगे। कहा यह गया था कि consumers और industries के फ़ायदे के लिये rates revise किये जा रहे हैं। इससे पहले का प्रभुत्त्व और निज़ाज गवर्नमेंट के ज़माने में भी यूनिट पर एक आना o. s. discount दिया जाता था। आज आपकी क्या हालत है। आज आप 4000 यूनिट तक 1½ anna per unit लेते हैं। 8000 यूनिट तक 1¼ anna per unit और 12000 यूनिट पर एक आना पर यूनिट लेते हैं। लेकिन कोई 12000 यूनिट जलाता ही नहीं। यदि कोई दो shifts भी चलाये तो 4000 या 8000 यूनिट से अधिक नहीं जलते। और आप ceiling price लेकर Rs. 4/– per cwt. और 1½ anna per

unit लेते हैं। ½ anna उसको subsidise करते हैं या exempt करते हैं। आपने रेट्स में तो बतला दिया कि 12000 unit पर एक आने के हिसाब से लेते हैं। लेकिन हैदराबाद में कोई Industry भी इतना consume नहीं करती। 4000 यूनिट पर तो आप 1½ anna plus Rs. 4/– लेते हैं। मैं चाहता हूँ कि ½ anna concession सारे यूनिट्स को देकर सारे यूनिट्स से उसी रेट्स से लीजिये जिससे कि उनको फ़ायदा हो।

दूसरी चीज़ यह कि consumers की हद्‌तक आप 20 units तक 0-5-6, 30 units तक 0–3–6 और 50 units 0–2–0, less ½ anna discount लेते हैं। Consumers में भी कोई 50 units नहीं जलाता। पांच छ: यूनिट्स जलाते हैं। उनसे आप रु. 2/– minimum लेते हैं। मैं चाहता हूँ कि आप minimum एक रुपया लें। 20, या 30 यूनिट्स जो जलाते हैं उनसे भी आप कम रेट लीजिये। रेट्स कम करने से आपका और हमारा सबका फ़ायदा होगा और देश की उन्नति होगी। निज़ाम सरकार से Hydro-electric power आने के बाद यह हाल है। रामगुंडम का क्या हाल है। रामगुंडम का जो contract दिया गया था वह terms के अनुसार खतम हो जाना चाहिये था लेकिन खतम नहीं किया गया। उसको extention दिया जा रहा है। बडे प्रसन्नता की बात है कि मन्त्री जी ने कहा कि यदि उनको 35 लाख रुपये दिये जायें तो वह खतम हो जायगा। लेकिन उससे जो एक लाख यूनिट पावर पैदा होगा वह किसको देंगे। अगर आप agriculture को देकर cost meet करना चाहते हैं तो आन्ध्र में तो agriculture के लिये यह cost एक आना per unit पडता है क्या आप इस कास्ट में यहां भी दे सकते हैं। आपको सिरपूर और सरसिल्क ही को देना होगा जो बाजू ही हैं। वहां वह एक करोड रुपया खर्च करके 15 हज़ार यूनिट खुदही पैदा कर ले रहे हैं। उनका व्यय जो आये भी तो आप अपने यूनिट्स को वहां ले जायेंगे। आप वहां heavy industries locate करें तो इसके लिये private enterprise या Government enterprise को आगे लाना पडेगा। यदि आप agriculture को देना चाहें तो आपके पास poles नहीं है, wire नहीं है। यह सब समुद्र पार से आना है इसके लिये आपके पास Foreign Exchange नहीं है। आपको अपना दृष्टिकोण देखना पडेगा। आपको यह विचार करना पडेगा कि आप रामगुंडम का लाभ rural class और agriclutural को किस तरह देंगे।

Purchase Store के सम्बन्ध में दो मिनिट में मैं अपने विचार रखूँगा। वहां गुजिश्ता मन्त्री वर्ग में Chief Engineer के ज़रिये एक स्कीम बनाई गई थी और 70 हज़ार की बचत बतलाई गई थी। उस समय मैं असेंब्ली में नहीं था, मगर चाहे मैं पार्टी के सम्बन्ध से क्यों न हो या खानगी तौर पर क्यों न हो इस से जानकारी रखता था। इस स्कीम को क्यों operate नहीं किया जा रहा है, और आज चीफ़ इनजीनियर की राय क्यों बदली जा रही है मालूम नहीं। यदि इस स्कीम को कार्य रूप में लाया जाय तो अधिक बचत होगी।

आखिर में एक चीज़ कह कर खतम करूँगा। गवर्नमेंट आफ़ इंडिया ने यह पालिसी announce की है कि electricity के लिये एक बोर्ड स्थापन किया जाये।

चीफ़ मिनिस्टर ने भी कहा था कि शीघ्र ही इसको स्थापन किया जायगा। मैं कहूँगा कि बहुत शीघ्र इस बोर्ड की स्थापना किया जाय। यदि हमें अपने industries को बढाना है और बजेट को बेलॅन्स करना है तो electriycity cheep करना लाज़मी है।

मुझे यह भी कहना है कि नर्सापूर ताल्लुक़ा हेडक्वार्टर होने पर भी निज़ामसागर से जो लाइन वहां से गुज़री है। उस से electricity नहीं दी गई है मैं हाल ही में निज़ामसागर गया था तो मेरी दृष्टि में यह लाया गया। मैं मन्त्रीजी से विनंती करूँगा कि वह इस ओर ध्यान दें। आज electricity की ज्यादा ज़रूरत है। मुझे आशा है कि आज के मन्त्री बहुत ही सचेत रहेंगे। शायद उनको 6 नवम्बर से आज तक अवकाश नहीं मिला है परन्तु अब वह पुरानी पद्धति को बदलेंगे। मैं यह भी कहूँगा कि आप जो 6% interest ले रहे हैं उसकी बजाय 4% लीजिये। हम पर 6% interest लगा कर जो अधिक खर्च बतलाते हैं उसको न लेते हुए मैं चाहता हूँ कि उसमें भी आप economy करें।

आपने मुझे जो दो एक मिनट अधिक अवकाश दिया है उसके लिये क्षमा मांगते हुए मैं अपना भाषण समाप्त करता हूँ।

శ్రీ కె. రాజమల్లు : మిస్టర్ స్పీకర్ ! విద్యుచ్ఛక్తి గురించి కేటాయించబడిన డబ్బు గ్రామాల అభివృద్ధికి తక్కువయినప్పటికీ దాంట్లో ఎక్కువ డబ్బు దుర్వినియోగం అవుతున్నది, misappropriation అవుతున్నది. ఏవిధంగా అంటే మంత్రులు మారినప్పటికీ Departmental Secretaries మారినప్పటికీ దాంట్లో వున్న లోపాలుమాత్రం అదే మాదిరిగా వుండి పోయాయి. ఆ లోపాలను నవరించడానికి ప్రభుత్వం యేమాత్రం చర్యతీసుకోవడంలేదు. ఉదాహరణకు డబ్బు ఏవిధంగా దుర్వినియోగం అవుతుందో కొన్ని విషయాలు మీముందు చెబుతాను. ఎందుకంటే Department లో ఒక సెక్షనుపైన ఎక్కువ favouritism వుంది. ఆ favouritism వల్ల కొంతమంది ఆఫీసర్లకు అనుకూలమైన సౌకర్యాలు కలిగించడమే కాక వాళ్ళు ఎటువంటి విపరీతమయిన తప్పులు చేసినప్పటికీ వాళ్ళపై అధికార్లు ఎటువంటి చర్యతీసుకోవడంలేదు. ఉదాహరణకు 'Payment of overtime allowance to supervisors of main sections of Electricity Department' తీసుకుందాం. మంత్రిగారికి కావలిస్తే street light section, incharge emergency superviser, main superviser మొదలైనవాళ్ళ పేర్లు కూడా నావద్ద వున్నాయి. మంత్రిగారడిగితే పేర్లు చెబుతాను. వాళ్లకు overtime allowance చెల్లిస్తున్నారు. వాళ్ళు overtime చేయవలసిన పనిలేదు. ఎందుకంటే వాళ్ళకు అసలు duty hours లోనే పూర్తిగా పనిలేదు. ఇక over time allowance ఏముంది ? అవసరం లేనప్పటికీ కూడా overtime allowance యిస్తున్నారు. వాళ్ళకు యివ్వడమే కాకుండా నిజంగా overtime పనిచేసినటువంటి వాళ్ళకు overtime రికార్డు కావడంలేదు. వారికి overtime allowance యివ్వడం లేదు. పెద్ద పెద్ద జీతాలున్నవారికే యీ మాదిరిగా యిస్తు

న్నారు. ఇది కాకుండా వారికి డిపార్టుమెంటుయొక్క కార్లు, జీపులు సప్లయి చేశాము. ఇవి వున్నప్పటికీ వారికి వేరే cycle allowance పేరుతో కొంతడబ్బు యిస్తున్నారు. ఇది ఎందుకు యిస్తున్నారో అర్థంకావడంలేదు.

[*Mr. Deputy Speaker in the Chair*]

మంత్రిగారు దానిని తెలియపరచాలి. ఇదే మాదిరిగా ఆ ముగ్గురు ఆఫీసర్లు డిపార్టుమెంటుకు సంబంధించిన పెట్రోలు ఇతర సామానులు అత్యధికంగా వాడుకొంటున్నారు. ఎంత పెట్రోలు సప్లయిచేశారో ఎంత వాడుకున్నారో log book maintainచేయడంలేదు. ఒకవేళ చేసినా irregular గా maintain చేస్తున్నట్లు నాకు తెలుస్తున్నది. ఈ విషయం మంత్రిగారు పరిశీలన చేయాలని కోరుతున్నాను. తరువాత యీ ఆఫీసర్లు యీ జీపులను, కార్లను పెట్రోలును వారు సొంతపనులకు వినియోగించుకుంటున్నారు. డిపార్టుమెంటు జీపులలో కార్లలో సినిమాలకు వెళ్ళటం, తమపిల్లలను బడులకు పంపించడం, యింకా యితర private trip లకు వాటిని దుర్వినియోగం చేసుకుంటున్నారు. ఇవన్నీ మంత్రిగారు దృష్టిలోపెట్టుకుని యికముందు అవి జరగకుండా చేయించడానికి ఏర్పాట్లు జరుపాలి.

ఈ డిపార్టుమెంటుకు చెందిన పెద్ద ఉద్యోగస్థులు క్రింద ఉద్యోగస్థులపట్ల favouritism చూపించడమేకాక ఎటువంటి పొరపాట్లు చేసినా వారిమీద చర్య తీసికొనడంలేదు. ఒక విషయం చెబుతాను. 1954 వ సంవత్సరంలో లాల్‌గుడా వద్ద ఉన్న high tension line దగ్గరకు Emergency Supervisor గా పనిచేస్తున్న ఎమ్. ఎ. ఖాదర్ అనే ఉద్యోగి వెళ్లి ఒక unskilled మజ్‌దూరును high tension line కు స్విచ్ వేయమని చెప్పినాడు. ఎలక్ట్రిసిటీ ఖానూన్‌ప్రకారం ఈ విధంగా స్విచ్ వేసేటపుడు ఇంజనీరు, సూపర్‌వైజరు అక్కడఉండి unskilled మద్‌దూరుకు చెప్పి దగ్గర ఉండి పని చేయించుకుంటాడు. ఈ ఉద్యోగి ఒక unskilled మజ్‌దూరుకు ఉత్తరువు ఇచ్చేసరికి అతనికి ఆ పని ఏ విధంగా చేయాలో తెలియని కారణంగా, చేయలేని పనిని చేయడంలో జరిగిన పొరపాటువల్ల, ఆ మజ్‌దూర్ పేరు గఫూర్ — చనిపోయాడు. ఈ విషయంపై ఛీఫ్ ఇంజనీరు, డిపార్టుమెంటల్ సెక్రటరీ ఎట్లాగైనా అతనిని (కాదర్‌ను) retire చేయించాలని ప్రయత్నం చేసినారు. మూడుసంవత్సరాలైనా అతనిమీద ఏ చర్య తీసికొనలేదు. మూడు నెలలక్రితం సనత్‌నగర్‌లో మరొక పొరపాటుజరిగింది. Unskilled మజ్‌దూరులచేత పని చేయించుకోవడంలో ఇద్దరు మనుష్యులు మంటలలో పూర్తిగా కాలిపోయారు. పూర్తిగా అస్వస్థులైనారు. ఇంతకుముందు warning ఇచ్చిన అదే ఉద్యోగి మీద ఇంతవరకు చర్య తీసికొనలేదు. Favouritism కారణమో మరొక కారణమో తెలియదు. ఇందులోనే అర్థమవుతున్నది

కదా ప్రభుత్వం loose policy. ఇష్టం ఉన్న వారికి favouritism చూపి, ప్రభుత్వం డబ్బు ఎక్కువగా ఇచ్చి, ఎక్కువ సదుపాయాలు కల్పించడమే కాక వారు ఏ పొరపాట్లు చేసినా చర్యకూడా తీసికోడంలేదు. పెద్ద జీతాలు తీసుకునే ఉద్యోగులు ఎటువంటి పొరపాట్లు చేస్తారో ఉదాహరణచెబుతాను. కొంతమంది కార్మికులను ఈ మధ్య prosecute చేసారు. వారి యూనియన్ ఆ కేసులను withdraw చేయవలసినదని కోరినది. కాని చేయలేదు. 27-11-56 నాడు యూనియన్‌వారు ఒక ఉత్తరం పంపారు. కేసులు withdraw చేసుకోవలసిందని ఇప్పటికి తొమ్మిది నెలలు అయినది. కోర్టుకు వెళ్లి విచారణ అయిన తరువాత 38 మజ్‌దూర్‌లలో 35 మందిని acquit అయినారు. నిరపరాధులని కోర్టు వారు నిర్ణయించినారన్నమాట. తొమ్మిదినెలలైన తరువాత 1-7-57 న సెక్రటరీ ఈ విధంగా వ్రాస్తున్నాడు :

"I am directed to inform you that the workmen listed in your letter cited have been prosecuted under the Indian Penal Code for subversive activities."

కోర్టువారు నిరపరాధులని తీర్పు చెప్పి acquit చేసిన సంగతికూడా సెక్రటరీకి తెలిసినట్టులేదు. Subversive activities అంటే ఏమిటి ? వీరేమైనా లైనులు తెగగొట్టారా ? ఫ్యాక్టరీలను విరగగొట్టారా ? భవనాలను విరగగొట్టారా ? What is the meaning of subversive activiteis ? లేనిపోనివి అన్నీ కార్మికులమీద పెట్టడం ఎందుకు ?

శ్రీ జి. వెంకటస్వామి : Point of information, Sir, కొంతమంది కార్మికుల మీద కేసు పెట్టారన్నారు. ఎక్కడ పనిచేసే కార్మికులు వారు ?

శ్రీ కె. రాజమల్లు : ఇంతకుముందే చెప్పాను అనుకొంటాను. వారు Municipal workers. వి. బి. రాజుగారు ఆ శాఖ మంత్రిగా ఉండగా ఉత్తరం పంపారు. నెంబరు 4250 - B 1 - 57/1. 38 మంది కార్మికులలోను 35 మందిని acquit చేశారు. ముగ్గురిమీద మాత్రం కేసు ఉన్నది. వారుకూడా acquit కాబోతున్నారు. అయినా పెద్ద జీతాలు తీసుకునే డిపార్టుమెంటు సెక్రటరీ వంటివారు ఇటువంటి నిర్ణయాలను తీసుకుని కార్మికులను బాధిస్తున్నారు. ఇక విద్యుచ్ఛక్తిశాఖ workers ఇండ్ల విషయమై ఎప్పటినుంచో మొరపెట్టుకుంటున్నారు. మెహిదీ నవాజ్ జంగ్ గారు మంత్రిగా ఉండగా స్కీములు తయారైనాయి. ఇంతవరకు ఏమికాలేదు. ఎందుకీ స్కీములను అమలుచేయలేదో మంత్రిగారు చెప్పాలని కోరుతున్నాను. Implementation of conciliation agreement విషయం ఉన్నది. 1951వ సంవత్సరములో యూనియన్‌కు management కు మధ్య వర్కర్లను గురించి agreement జరిగింది. ఇప్పటికి దానిని

అమలుచేయలేదు. ఎందుకు అమలు చేయలేదో మంత్రిగారు చెప్పాలని కోరుతున్నాను,

మిస్టర్. డిప్యూటీ స్పీకర్ : చాలామంది సభ్యులు మాట్లాడేవారున్నారు. 12½ గంటలకు ప్రతిపక్షంనుంచి ఆఖరు ఉపన్యాసం. తరువాత మంత్రిగారి జవాబు ఉంటుంది. చాలామంది మాట్లాడే సభ్యులున్నారు కనుక సభ్యునికి 8 నిముషాలే ప్రత్యేకించబడినది. 6 నిముషాలు తరువాత 2 నిముషాలే ఉన్నదని తెలియచేయుటకు bell ఇవ్వబడును. దయచేసి తరువాత రెండు నిముషాలలో గౌరవసభ్యులు ఉపన్యాసాన్ని ముగించాలని కోరుతున్నాను.

*Sri P. Anthony Reddi (Ananthapur):* Mr. Speaker, Sir, I strongly support the Demand moved by the Hon. Minister for Electricity for Rs. 13 crores and odd. A review of his Report shows us that they are doing something for rural electrification. But, still, I feel, Sir, that what they are doing is not sufficient. They seem to feel that any electricity scheme should be a business proposition; that is, whatever they do should bring some sort of gain to the Government.

Sir, Government is rather showing some sort of partiality towards rural electrification. In towns, when they give electricity, it is mainly for giving comforts to the people. But in rural areas, it is given for production purposes. In towns, usually, it is only extension of services. In rural areas, they have to lay the lines for a number of miles before they give electricity to villages—whether for agricultural purposes or for domestic consumption. Therefore, Sir, I request the Government that whenever they take up the schemes of rural electrification they should not include the cost of laying the lines as one of the items of expenses for giving service. I would give a typical example. There is, in Anantapur, talukKudair Electrification Scheme. To give the first connection, they have to lay the lines for 13 miles. When they calculate gain, they consider the capital expenditure on 13 miles and also the capital expenditure for service connections. If they take the expense for services connections above probably, the Government may gain 20%. But, if they include the expenditure for laying 13 miles line, naturally, the percentage of gain will go down to 9% or even less. That is why rural electrification appears to be not paying. Therefore, hereafter at least the Government should look into this and see that the capital expenditure till the point where the first connection is given, is not included for purposes of considering remuneration due to the Government.

Again, rural electrification is mainly for agricultural purposes. Especially in backward areas where rainfall is very low, electricity

will give lot of benefit to the poor agricultural ryot. Now-a-days where lift irrigation is used, a diesel oil for engines cost the ryot adout Rs. 150 per acre per year. If electricity is used, the same ryot may manage with Rs. 50 or Rs. 60 per acre per year, and save about Rs. 100 per acre. This itself is a great gain. The Government no doubt gets their percentage, but the ryot reduces the expenditure and produces far more and thus adds to the national wealth. Therefore, Sir, any rural electrification scheme adds to the national wealth, while a scheme for towns is purely for comforts and so it does not add to the national wealth. The Government should also consider this point of view while taking up rural electrification Schemes.

Then, Sir, I feel there is some sort of wastage of man-power in the Power Stations. In the Power Houses, the foremen who look after the turbines are the most important persons and for every turbine there may be 3 or 4 foremen. They do almost every work connected with the turbines. Now, to look after the work of these Foremen, there are 3 or 4 Junior Engineers and also one Assistant Engineer. I do not see the work that is beeing done by the Junior Engineers. If the engine or turbine goes out of order, it is this Foreman that does the work under the supervision and with the assistant of the Assistant Engineer and these Junior Engineers have little work except perhaps do little supervision over the work of the Foremen; and this supervision work can be done as well by the Assistant Engineer. Therefore, Sir, in the Power Houses the number of Junior Engineers can easily be reduced to one. I request the Hon. Minister to look into this matter and see that some sort of retrenchment is effected in this regard.

Last year, while I was travelling from Anantapur to Kurnool, I saw the telephone line laid by the Electricity Department standing slanting and these lines were laid just a year before. What is the reason for this bad erection of these telephone lines? There must be some mischief played by the contractor. Why has not the Department looked into this? Therefore, Sir, I feel that while laying these telephone lines, the department did not exercise proper supervision. I request that the Government should look into these things and see that efficiency is maintained in all such construction works.

With these few suggestions. Sir, I take leave and thank the Deputy Speaker for giving me this opportunity.

శ్రీ షేక్ మౌలాసాహెబ్ (ఉదయగిరి) : అధ్యక్షా! మంత్రిగారు తెచ్చిన ఈబిల్లును నేనుబలపరుస్తూ, వారికి ఒకచిన్నసలహా ఇవ్వదలచుకొన్నాను. ఎందు వల్లనంటే ఇతరమంత్రులకు ఇటువంటి స్కీముల విషయాలు ఏవివ్రాసినా వారు

జవాబులు ఇవ్వరు. కనీసం వారిశ్రకటరీలద్వారానైనా జవాబులువచ్చేటట్లు చేయరు. కాని వీరికి ఎలక్ట్రిసిటి గురించి నేనువ్రాస్తే వెంటనే జవాబువ్రాశారు. అయితే ఆ డిపార్టుమెంటు ఛీఫ్ ఇంజనీరునుండి మాత్రం జవాబు రాలేదు, కొంచెం విచారకరం. వారివద్దనుండికూడా సమాధానంవచ్చేటట్లు చూస్తారని వారిని కోర్తున్నాను.

రెండవ విషయమేమిటంటే, ఒకరిఅభిప్రాయము ఒకరుతెలుసుకోటానికే ఈ శాసనసభా సమావేశములు జరుగుతున్నాయి. అటువంటప్పుడు సభ్యులను మాట్లాడకుండ క్రమబద్ధంచేసి, ఏవో రెండు డిమాండులపైన మాట్లాడమని నిర్ణయించటం విచారకరము. మారుమూలలనుండి వచ్చి అక్కడజరిగే వ్యవహారాలు ప్రభుత్వదృష్టికి తీసుకునిరావాలంటే మాకు మాట్లాడటానికి అవకాశం లేకుండా చేశారు. దానికి 5 నిమిషాలు, 6 నిమిషాలు మాట్లాడమని నిర్ణయించటం చాలా విచారకరమైన విషయం.

అటువంటప్పుడు పొదుపువిధానం ఒకటివుంది. 300 శాసనసభ్యులు వున్నప్పుడు నెలరోజులుగా ఈ శాసనసభ జరిగేటప్పుడు. రోజుకు 10 మందివద్ద **D. A.** తీసుకొంటె డబ్బు చాలావరకు మిగులుతుందేమోనని ఆశిస్తున్నాను.

ఈ డిమాండు మేము ఎందుకు బలపర్చాలనేది మొదటిపాయింటు. అయినప్పటికి వారికి నేను ఒక విజ్ఞప్తిచేస్తున్నాను. మేము శాసనసభ్యులుగా యిక్కడకు వచ్చినతరువాత ఈ డిమాండులన్నీ, వారు చేసే ఖర్చులపద్దులన్నీ ఈ బడ్జెటుద్వారా ఆమోదించటము, డబ్బుతగ్గినప్పుడల్లా మీయిష్టానుసారంగా పన్నులువేస్తే ఆపన్నులను బిల్లులద్వారా ఆమోదించటం, అవసంవచ్చినపుడు, ప్రతిపక్షంసభ్యులు కోరినపుడు మేములేచి ఓటుచేయటం, ఇదిమాత్రమే శాసన సభ్యుల బాధ్యతకాదని నేను అనుకొంటున్నాను. నేను ఆంధ్ర శాసనసభకు గెలిచినపుడు అప్పటి ప్లానింగ్ మంత్రిగారు 'ప్రతిశాసనసభ్యుడు ఆ నియోజక వర్గంలోవుండే స్కీములన్నీ ఒక జాబితారూపంగా తయారుచేసి ఈ అయిదు సంవత్సరాల కార్యక్రమాన్ని ప్రభుత్వానికి అందచేయండి' అని చెప్పారు. అప్పుడు 22-4-1955 న మా తెలుగు వారికి రాదనే ఉద్దేశ్యంతో ఈ స్కీము లున్నాయని అచ్చువేయించి ఇచ్చాను. కాని ఏమీ జరగలేదు. ఇండియా ప్రభుత్వమువారు ఏదృష్టిలో ఈ పంచవర్ష ప్రణాళికలు అమలుజరగాలనిపెట్టారు? ఈ పంచవర్ష ప్రణాళికలు లేనిదేశాలు ఏమైపోతున్నాయి ? బ్రిటిష్ ప్రభుత్వాన్ని పారద్రోలి ఈ కాంగ్రెస్ ప్రభుత్వమును నెలకొల్పాము. అది ఆచంద్రార్క స్థాయిగా శాశ్వతముగా నిల్వాలనే ఉద్దేశ్యంతో, వున్న అపోహాలన్నీ తొలగించి, ఈ దేశాభివృద్ధికి తోడ్పడటానికి ఈ ప్రణాళికలు నిర్మించారు. ఈ ప్రణాళికల ముఖ్యోద్దేశం ఏనాడు అభివృద్ధిచెందని వెనుకబడిన ప్రాంతాలలో అభివృద్ధిని

కనపరచి, నిరుద్యోగము, దారిద్ర్యము తాండవమాడుచున్నచోట అవిలేకుండా చేయాలని ఈ ప్రణాళికలు తలపెట్టారని నేను పూహిస్తున్నాను. అటువంటి వెనుకబడిన ఫిర్కాలను మన ఇండియా ప్రధాని ప్రపంచ శాంతిదూత శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారు గుర్తించారు. 15-1-1955 న వారు ఎన్నికల ప్రచారంనిమిత్తం కడపకు పెడుతూ, నెల్లూరు జిల్లాలోవున్న ఉదయగిరి మీదుగాపోతూ ఆప్రాంతాలగురించి వారు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులద్వారా గెలువబోయే శాసనసభ్యునకు కాంగ్రెస్ తరఫునటిక్కెట్టు ఇచ్చిన శాసనసభ్యుడనైన నాకు తెలియజేశారు. కాని ఈ ప్రభుత్వములోని మంత్రులుమాత్రం శాసనసభ్యులకు అటువంటి విషయములు తెలియపరుస్తే వారి ప్రిస్టేజ్‌కి అవమానకరంగా వుంటుందేమోననే ఉద్దేశ్యంతో వారు తెలియపర్చటంలేదని నేను భావిస్తున్నాను. వారిమాదిరిగా మేము ఎన్నికై వచ్చాము. మాలోనుండే వారు మంత్రులు అయినారు. కాబట్టి వారు చెప్పేదంతా మేము ఆమోదించక తప్పదు. అది మా క్రమబద్ధమేమో ! కాంగ్రెసు క్రమశిక్షణ యిటువంటిదేమో నాకుతోచడంలేదు.

నాగార్జునసాగర్ పరియాలో ఉదయగిరి, కనిగిరి, పొదిలి, దర్శి తాలూకాలు వున్నవి, వాటికి హైలెవెల్ ఛానల్ కావాలని ఆందోళన చేశారు. కాని మార్కాపురం దగ్గర పర్మిట్ చేసిన లెవెల్ సోమశిల దగ్గర చేస్తున్నారు. క్రిందుగా తీసుకుపోతే పర్మిట్ చేస్తుందన్నారు, నేరుగా గీతగీచినట్లుగా కాలువ తీస్తే ఎందుకు పర్మిట్ చేయదు? ఏమి టెక్నికల్ పరిజ్ఞానమో ఏమి ఇంజనీరింగో నాకు అర్థంకావటంలేదు. ఆ విషయం గురించి ఎన్నో పద్ధతులు సూచించాము. కాని వాదిదృష్టి దానికివిరుద్ధముగాఉంది. యథాప్రకారం బంజర్లులాగావుంచి, అక్కడి ప్రజలను కూలీ ప్రజలుగా వరికోతలకు, వరినాట్లకు ఉపయోగపెట్టుకొని, వాళ్ళు బాగుపడకుండా ఉండవలెనన్నట్లుంది. ఆ కాల్వల నిర్ణయంపై కూడా వారు జవాబు చెప్పటంలేదు. అక్కడ జీవనదులు లేవు. కప్పిలబావుల ఆధారమే అక్కడ. అక్కడివారు వర్షంమీద ఆధారపడుతున్నారు. ఈ electricity తో దీపాలు వెలుగుతున్నాయి. ఆ దీపాలు ఇదివరకు కిర్సనాయలు దీపాలు వెలిగే చోట వెలుగుతున్నాయి. వాళ్ళు కిరసనాయిలుకు పెట్టే ఖర్చులు కూడా ప్రభుత్వం తగ్గించి, వారిఇండ్లకు, పడకగదులకు ఎక్కువ అవకాశాలు కలుగ చేస్తున్నారు.

**Electricity** వల్ల దేశమంతటను వెలుతురు వ్యాపించుచున్నది. మొత్తము మీద ప్రపంచమంతటను చీకటి అంతామారి పెద్ద గ్రామాలకు పట్నాలకు వాటి చుట్టూ గ్రామాలవరకు తేజస్సును కలుగజేస్తున్నది. ఈ **Electricity**అనేది వ్యవసాయ పరిశ్రమకు ఉపయోగపడాలి. దేశములో వ్యవసాయము **Electricity** ద్వారా అభివృద్ధి చెందితేగాని, దేశములో ఉన్న నిరుద్యోగ సమస్య, దారిద్రి

యము పోవటానికి వీలుండదు. Electricity ని సినిమాల ప్రదర్శనకు ఎక్కువగ ఉపయోగిస్తున్నారు. కాని, పరదేశ ఫిలిములను చూచినప్పుడు పరిశ్రమలకని గుర్తించాలి. మనరాష్ట్రములో ఖనిజసంపదలు ఎక్కువఉన్నవి. ఖనిజసంపదకు గాని, కప్పీలబావులలోనుండి నీరుతోడటానికిగాని జలాధారాలను పొలముల కుపయోగించి వ్యవసాయాభివృద్ధికిగాను యీ Electricity ని ఎక్కువగ ఉపయోగిస్తే, మనదేశము ఆర్థికంగా బాగుపడటానికి అవకాశముంటుంది. ఈ Electricity ని కేవలము బస్తీలో ఉండేవారికే ఇస్తామని అంటున్నారు. మంత్రి గారి ప్రారంభోపన్యాసములో బస్తీలకు తాలూకాలకు యిస్తామని చెప్పారు. మనకు రైళ్లుఉన్నవి, తారురోడ్లు ఉన్నవి.Electricity లేనప్పుడు మనము petro-max lights ను ఉపయోగించేవారము. ఏనాడు కూడ వెలుతురు లేనిచోట్లలో అంతటను Electricity ద్వారా వెలుతురు ఉండేటట్లుగా చేస్తారని ఆశిస్తున్నాను. అది వ్యవసాయం - పరిశ్రమలకు ముఖ్యముగా ఉపయోగపడాలి. ఏదో మనము ఇక్కడ సభ్యులముగా వచ్చాము. మనము పరిపాలన చేస్తున్నాము, మాకు మంత్రి పదవులు ఉన్నవి అని అనుకుంటె ప్రయోజనము లేదు. ఎవరైన ప్రఖ్యాతిగాంచిన వారి మరణవార్త వినగానే, మనము సంతాపమును ప్రకటించి, మరణించినవారి కుటుంబానికి యీ సభద్వారా సానుభూతి తెలియజేస్తున్నాము. ప్రభుత్వంలోనికి ఒక్కొక్కరు మంత్రివర్యులుగా వచ్చినప్పుడు, ఆయనయొక్క పేరు శాశ్వతము గాను, ఆచంద్రార్కముగాను ఉంటేటట్లు, మంచిమంచి పనులు, ప్రజల క్షేమము అభివృద్ధిదృష్ట్యా చేయాలని కోరుతున్నాను. మన రాష్ట్రములో చాలా ప్రదేశములు, అందులో ముఖ్యంగా మా ఉదయగిరి తాలూకా చాల వెనుకబడి యున్నదని పండిట్ జవహర్లాల్ నెహ్రూగారితో సహా గుర్తించారు. అంతటి గొప్పవారు గుర్తించగలిగినప్పుడు మన ప్రభుత్వమువారు ఎందువల్ల గుర్తించ లేదో అర్థముకావడము లేదు. ఇది చాలా విచారకరముగ ఉన్నది. మా నెల్లూరు జిల్లాలో ఉదయగిరి, కావలి, పొదిలి, కనిగిరి, వింజమూరు తాలూకాలు అన్నీ చాలా వెనుకబడిన తాలూకాలు. ఆ ప్రాంతాలలో Electririty ని సప్లయిచేస్తే, వ్యవసాయమునకు యింతవరకు కప్పీలతోను, మోటారులతోను నీరు తోడి ఉపయోగిస్తూ కష్టజీవితము గడుపుతున్నారు. ఇప్పుడు యీ Electricity ని ఆ ప్రాంతాలలో సప్లయిచేస్తే, వ్యవసాయమునకు చాలా అనుకూల పరిస్థితులు ఏర్పడగలవు. రైతులకు చాలా భాగము ఖర్చులు కూడ తగ్గిపోతవి. అందువల్ల ఆ ప్రాంతాలలో త్వరలో Electricity ని సప్లయి చేయిస్తారని, వారి కష్టములు యీ విధముగ తీర్చుతారనీ ఆశిస్తున్నాను. కావలి to కనిగిరి, వింజమూరు to ఉదయగిరి, వింజమూరు to ఆత్మకూరు, ఎలక్ట్రిసిటీ నిర్మించు స్కీము జిల్లా ప్లానింగ్ కమిటీ ఆమోదముతో ప్రభుత్వానికి పంపబడియున్నది. 1957-58 సంవత్సరంలో ప్రయార్టి యిచ్చి నిర్మించెదరని ఆశిస్తున్నాను. నేను చెప్పిన ముఖ్యవిషయాలను గురించి

మంత్రిగారు తమ జవాబులో వివరములు తెలియజేయవలసిందిగా హృదయ పూర్వకముగా కోరుతున్నాను. అధ్యక్షులవారు యీ అవకాశము యిచ్చినందులకు వారికి నా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

శ్రీ యస్. కాశిరెడ్డి : అధ్యక్షా, ఏ దేశములోనైనా పరిశ్రమలుగాని, వ్యవసాయముగాని అభివృద్ధికావాలంటే, దానికి విద్యుచ్ఛక్తి ప్రధానపాత్ర యని మనకు తెలుసు. అందువల్లనే ప్రథమ పంచవర్ష ప్రణాళికలో దీనికి కొంత ప్రాముఖ్యత యివ్వబడింది. ప్రాముఖ్యత యిచ్చిన తరువాతకూడ ప్రస్తుత పరిస్థితులు చూస్తే తెలంగాణలో యీ నాటికికూడ కేవలము ఇరవై గ్రామాలకే **Electricity** యివ్వబడింది. ఇక ఆంధ్రదేశములో చూస్తె 681 గ్రామాలకు యివ్వబడింది. **Percapita** తెలంగాణలో అయిదు యూనిట్లు ఆంధ్రలో ఎనిమిది యూనిట్లు మాత్రమే ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సాధించబడింది. అందువల్ల యిప్పటికీకూడ **electricity supply** విషయములో మనము చాలా వెనుకబడి యున్నామని స్పష్టపడుతున్నది. ఇక పరిశ్రమ విషయములో చూస్తే ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రములో చాలా వెనుకబడియున్న పరిస్థితులున్నవి. ఇలాంటి పరిస్థితులలో యీ ప్రాంతాలను ముందుకు తీసుకొనిపోవాలంటే, విద్యుచ్ఛక్తి చాలా అవసరము. అయితే పంచవర్ష ప్రణాళికలో ఎంతో ధనము వ్యయము చేసినప్పటికినీ మనము యింకను వెనుకబడే యున్నామంటే యింకా ఎంతో కృషి చేయవలసిన అవసరమున్నదని మనము గుర్తించవలసి యుంటుంది. ద్వితీయ పంచవర్షప్రణాళికలో 21 కోట్లు ఆంధ్రలోనూ, 5 కోట్లు తెలంగాణలోనూ, రెండుచోట్లలోనూ కలిపి మొత్తము 26 కోట్లు ఖర్చుచేయటానికి కేటాయింపు నిర్ణయించబడింది. ఈ 26 కోట్లలోనూ, యీ సంవత్సరము పది కోట్ల 73 లక్షల రూ.లు ఖర్చుచేయాలని అన్నారు. ఇందులో **net expenditure** 6 కోట్ల 20 లక్షలు మాత్రమే కనబడుతున్నది. ఈ సొమ్ముకూడ పరిశ్రమల కొరకే ఎక్కువగ కేటాయించబడింది. అయితే గ్రామాల విషయము తీసుకుంటే పోయిన సంవత్సరయి కేటాయించబడిన ఆరుకోట్లలో యీ సంవత్సరమువరకు రెండుకోట్లు ఖర్చుచేయబడి, మిగిలిన నాలుగుకోట్లు కూడ వేరే కార్యక్రమాలకు **divert** చేయబడింది. అందువల్ల గ్రామాలకు రెండుకోట్లే **electricity** మీద ఉపయోగించబడింది. రాబోయే 3 సంవత్సరాలలోకూడ గ్రామాలకు విద్యుచ్ఛక్తి విస్తృతముచేయడము కష్టసాధ్యమని మంత్రిగారు చెబుతున్నారు. మనదేశము వ్యవసాయదేశమని అందరికీ తెలుసు. ఆంధ్ర ప్రాంతములో వ్యవసాయము ద్వారా కొంతవరకు ఉత్పత్తి జరుగుతున్నప్పటికినీ, తెలంగాణలో అయిదు ఆరు జిల్లాలు మాత్రము అనగా వరంగల్, నల్లగొండ వగైరాలు ; రాయలసీమలో నాలుగు జిల్లాలు, నెల్లూరు, విశాఖపట్టణము, యీ జిల్లాలలో వ్యవసాయము ఎక్కువగా బావులక్రిందనే జరుగుతున్నదని మనకందరికీ తెలుసు. వ్యవసాయము

కేవలము ఎద్దులతో ఎక్కువకష్టముతో, చేసేదానికంటె electric pumps ద్వారా నీరు సరఫరాచేస్తే, ఎక్కువ సులభముగ అధికోత్పత్తి సాధించవచ్చునని అందరికీ తెలుసు. దీనిని ఎవరూ కాదనలేరు. ఈ విధముగ బావుల క్రింద వ్యవసాయము జరిగే ప్రాంతాలలో ఉన్న గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి రాబోయే మూడు సంవత్సరాల దాకా చేయటానికి వీలుండదని చెబితే, ఆ ప్రాంతాలలో వ్యవసాయము ఇదివరకు మాదిరిగానే వెనుకబడియుండును. వ్యవసాయము దెబ్బతింటు న్నట్లేనని గుర్తించాలి. మన రాష్ట్రములో తిండిగింజలకు ధరలు పెరుగుతున్న కారణము వాటి ఉత్పత్తి తక్కువఅయినందుననేననిన్నీ, ఆహారోత్పత్తి అధికము చేయాలనిన్నీ కేంద్రప్రభుత్వము చెబుతున్నప్పుడు, electricity supply ద్వారా నైనా వ్యవసాయము అభివృద్ధిచేసి, అధికముగ ఉత్పత్తిచేయుటకు ప్రభుత్వము తోడ్పడాలి. అధికోత్పత్తి ఏవిధముగ జరుగుతుందో ప్రభుత్వము గుర్తించి నట్లు లేదు. ప్రస్తుత పరిస్థితులు చూస్తే జనాభా పెరిగిపోతున్నది. ప్రజావసరాలు ఎక్కువైనవి. పండించిన తిండిగింజలు చాలడములేదు. అందువల్ల ప్రజలు ఎక్కువ ధరలు పెట్టి తిండిగింజలు కొనుక్కోవలసివస్తున్నది. అధికోత్పత్తిచేస్తేగాని తిండి గింజలకు ధరలు తగ్గవని అంటున్న ప్రభుత్వము, మరి యీ విషయము ఎట్లు గుర్తించలేకపోతున్నదో అర్థముకావడములేదు. మన దేశములో పండించిన ధాన్యములు చాలకపోవడము వల్ల విదేశాలనుంచి వీటిని దిగుమతిచేసుకోవలసిన గతి మనదేశమునకు పట్టటము విచారకరముగ ఉన్నది. మనదేశములో నదులున్నవి. వ్యవసాయమునకు తగినంత భూమి, నీరు ఉన్నది. electricity ని సప్లయిచేస్తే, ఎక్కువగ పండించటానికి అవకాశములుఉంటాయని తెలుసుకొన్న యీ ప్రభుత్వము, యింకా మూడుసంవత్సరముల దాకా electricity ని వెనుకబడిన ప్రాంతాలకు సప్లయిచేయటానికి వీలుకాదని అంటే, ఏమి చెప్పగలము ? అలాగైతే యింకను మూడు సంవత్సరముల దాకా ప్రజలు యిదేవిధముగ బాధపడవలసిందేనా ? Electricity అన్ని ప్రాంతాలకుగూడ సప్లయిచేస్తే, త్వరిత గతిని వ్యవసాయము వృద్ధిలోకి తెచ్చుకోవచ్చును గదా ! అధికోత్పత్తిచేస్తే ప్రభుత్వానికి గూడ అధికాదాయము రాదా ? బడ్జటు లోటుకూడ తీర్చటానికి అవకాశము లుంటాయి అనేసంగతి గుర్తించాలి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కేవలము రెండుకోట్లే యీ సంవత్సరము ఖర్చుచేయడమంటే, ప్రస్తుత పరిస్థితులను బట్టి యీ సొమ్ము చాలా తక్కువ అని చెప్పకతప్పదు. ఇటీవల ముఖ్యమంత్రిగారు, పార్లమెంటు సభ్యులు, యింకా యితరులు కలిసి సమావేశమైన మీటింగులో ముఖ్యమంత్రిగారు ద్వితీయపంచవర్ష ప్రణాళికలో యీసం. మనకు విద్యుచ్ఛక్తిక్రింద ఖర్చుచేయటానికి అయిదుకోట్లుకావాలని, కేంద్రప్రభుత్వాన్ని అర్థించటానికి ఒక note కూడ యివ్వడము జరిగింది. ఈ సొమ్ము కొరకు కేంద్ర ప్రభుత్వాన్ని అడగడము అవసరమే, అయితే బావుల విషయము వచ్చి నప్పుడు కొన్ని కొన్ని చోట్లలో పథకాలు తయారైనవి. ఉదాహరణ చెప్పా

లంటే గుంటూరుజిల్లాలో, ఒంగోలులో, కొత్తగూడెం దగ్గర తయారైనవి. ఓంగోలు దగ్గర ఒక sub-station కట్టియున్నారు. గతములో ఒక పర్యాయము ప్రశ్నోత్తర సందర్భములో దర్శి, పొదిలి, కనిగిరి, ఉదయగిరి తాలూకాలలోని 29 గ్రామాలకు electricity supply యిస్తామని మంత్రిగారు చెప్పినప్పటికినీ అది తక్కువ సంఖ్యే. ఒక్కొక్క గ్రామములో 20, 30, 50 యీ మాదిరిగ బావులు ఉన్న గ్రామాలు గనుక వాటికైనా సప్లయి చేయాలి. ఈ గ్రామాలకు దగ్గరగా ఉన్న ఒంగోలు sub-station కు సంబంధించిన పథకములు ఇంతవరకు కూడా పూర్తికాలేదు. తాలూకా కేంద్రాలయిన దర్శి, పొదిరి, కనిగిరి, ఉదయగిరి, యీ నాలుగు చోట్లకు అయినా యీనాటివరకు electricity రాలేదు. మంత్రిగారుచెప్పిన దానినిబట్టి చూస్తే ఇంక మూడు సం॥ దాకా యీ చోట్లకు electricity వచ్చే అవకాశములు లేనట్లు కనబడుచున్నవి. డబ్బు లేనందువల్ల యీ పథకములు అములు జరుగవనేటటువంటి ప్రమాదము ఉన్నది. అందువల్ల కేంద్ర ప్రభుత్వముమీద మనమందరము ఒత్తిడిచేసి, మనకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు అవసరమైన ధనమును తెచ్చుకోటానికి కృషిచేయవలసిన అవసరము ఉంటుంది.

ఇకపోతే డిపార్టుమెంట్సులో corruption, mismanagement జరుగుతున్నదని గౌరవసభ్యులు అనేకమంది ప్రభుత్వ దృష్టికి తీసుకునివచ్చారు. దీనిని check up చేస్తే కొన్ని లక్షలు, కోట్లు కూడా మిగలగలదని నా నమ్మకము. కేంద్ర ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిన పొదుపు ఉద్యమమునకు కూడ తోడ్పడగలదు. మన రాష్ట్రపు చీఫ్ ఇంజనీరు గారు యిటీవల జరిగిన సమావేశములో డిపార్టుమెంటు చేతులలో ఉన్న రికార్డులో ఉన్న లెక్కలనుబట్టి పరిశీలించగా సుమారు ఇరవై లక్షల దాకా mismanagement జరిగినట్లుగా తెలుస్తున్నది. అదే విధముగా 5½ కోట్ల రూపాయలఖరీదుగల సామానులు తెప్పిస్తే, అందులో ఒక కోటి రూపాయల విలువగల సామానులు పోయినవన్న సంగతి తెలిసినట్లు గౌ॥ సభ్యులు చెప్పారు. కాబట్టి యిలాంటివి జరుగుతూ ఉంటే, కోట్లకొలది డబ్బు ప్రభుత్వము పోగొట్టుకుంటూ ఉంటే, ప్రభుత్వానికి ఆర్థిక దుస్థితి రాక మానదు. కాబట్టి యీ విషయములో ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధవహించి, యిలాంటి లోటుపాటులు జరగకుండా చూడటానికి కృషి చేయవలసిన అవసరమున్నదని ప్రభుత్వము గుర్తిస్తారని ఆశిస్తున్నాను. ఇప్పుడు యింకను మాట్లాడవలసిన విషయములు ఉన్నను, నాకు టైము అయిపోయింది గనుక యింతటితో విరమిస్తున్నాను.

శ్రీ పి. బాపయ్య (తిరువూరు) : అధ్యక్షా, ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయము రావడానికి అవకాశము ఉన్నటువంటి విద్యుచ్ఛక్తి పద్దులమీద తక్కువ

allotment వచ్చినందుకు చాల విచారముగ ఉన్నది. మంత్రిగారు తమ ఉపన్యాసములో rural electrification విషయంలో చాల ఆశాభంగంగా చెప్పారు. మన దేశం వ్యవసాయక దేశం. 100 కి 80 మంది వ్యవసాయంమీదనే ఆధారపడి జీవిస్తున్నారు. వ్యవసాయంమీద ఆధారపడి జీవించేటటువంటి ప్రజలను వ్యవసాయం మీదనుంచి తప్పించి ఇతర వృత్తులు కల్పించాలంటే విద్యుచ్ఛక్తి అవసరము. గ్రామాలలో కుటీరపరిశ్రమలు పెంచి వాటి ద్వారా వారికి వృత్తి కలిగిస్తేనేగాని వ్యవసాయంమీద ఒత్తిడి తగ్గదు. ఈ విధంగా చేయకుండా కేవలం భూసంస్కరణలవల్ల ప్రజల యొక్క ఆర్థిక పరిస్థితులు పెంచడం అంటే చాల కష్టమైనటువంటి విషయం. గ్రామాల అభివృద్ధి కొరకు గ్రామాలలో విద్యుచ్ఛక్తిని ఎక్కువ supply చేయాలనే విషయం మంత్రిగారు దృష్టిలో పెట్టుకొని, Central Government తో, Planning Commission వారితో సంప్రదించి విద్యుచ్ఛక్తి supply కు ఎక్కువ ధనం చేకూర్చగలుగుతారని నమ్ముతున్నాను.

కృష్ణా జిల్లాలో తిరువూరు స్కీము పూర్తి అయినది. తిరువూరులోను మరి యితర పంచాయితీ గ్రామాలలో light లు వెలిగించారు. అంతమాత్రంతో ప్రజలకు తృప్తిలేదు. ఆ స్కీము క్రింద మొత్తం 70, 80 గ్రామాలు ఉంటే 26 గ్రామాలు మాత్రమే ప్రస్తుతం ఆ scheme క్రింద తీసుకోబడినవి.

ఆ 26 గ్రామాలలో కూడా ఇంతవరకు వ్యవసాయం నిమిత్తం విద్యుచ్ఛక్తిని release చేయలేదు. "మీ గ్రామంలో ఎన్ని బావులు ఉన్నాయి. ఎన్ని బావులకు మీరు విద్యుచ్ఛక్తి ఉపయోగిస్తారు" అని స్కీము ప్రారంభించేముందు agreement తీసుకొంటారు. మళ్లీ చివరకు ఆ agreement పూర్తిచేసేటప్పుడు కొందరు ఇవ్వలేనటువంటివాళ్లు ఉంటే, లేక మొట్టమొదట ఉత్సాహంతో మా బావికి పెట్టుకొంటాము అని అనుకున్నవారు తరువాత డబ్బు లేకనో, ఇంకా ఏ ఇతర కారణాల చేతనో రెండోసారి agreement ఇవ్వకపోయినట్లయితే ఆ గ్రామాలకు విద్యుచ్ఛక్తి Supply చేయడంలేదంటారు. ఎవరో ఒకరిద్దరు చివరిలో agreement ప్రకారం ఇవ్వకపోయినంతమాత్రంచేత agreement ఇచ్చినవాళ్లకు కూడా నష్టం వస్తున్నది. అటువంటిదిలేకుండా ఇదివరకు list లో ఉన్నటువంటి గ్రామాలన్నిటికి విద్యుచ్ఛక్తి release చేయవలసిందని నేను తమ ద్వారా మంత్రిగారిని కోరుతున్నాను. గత budget లో. కృష్ణా జిల్లాలోని నూజివీడు స్కీము ఉన్నది. అది దాదాపు 66 లక్షల రూపాయల స్కీము. ఆ స్కీము గత సంవత్సరం budget లో చూపించబడింది. కాని ఈ budget లో ఎక్కడా కన్పించలేదు. అది ఏమైందో తెలియదు. నూజివీడు తాలూకా విస్సన్నపేట ఫిర్కా గ్రామాలకు విద్యుచ్ఛక్తి చాలఅవసరం. అక్కడివారికి commercial crops మీదనే ఎక్కువ ఆదాయమువస్తున్నది. ఒక్కొక్క గ్రామంలో 30, 40.

50 బావులు ఉన్నాయి. ఆ బావులన్నింటికి oil engines పెట్టుకొని వారు వ్యవసాయం చేసుకొంటున్నారు. Commercial crops ను ఎక్కువగా పండించినపుడే ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయం రావడానికి అవకాశం ఉన్నది. అక్కడ పొగాకు, మిర్చి, ఉల్లి మొదలైన పంటలన్నీ పండిస్తారు. ఆ గ్రామాలలో వారు oil engines వల్ల చాల కష్టపడుతున్నారు. మధ్యమధ్య ఈ oil engines ఆగిపోవడంకూడా కద్దు. అవసరంవచ్చిన కాలంలో oil engines పని చేయకపోవడం, రిపేర్సుకు Technicians దగ్గర లేకపోవడంవల్ల వారు చాల నష్టపడుతున్నారు. అటువంటి గ్రామాలవారు ఈ Scheme పూర్తి కావడంతోటే మన కష్టాలన్నీ తీరుతవి. మన పంటలన్నీ అభివృద్ధి అవుతాయి. డెల్టా గ్రామాలలో మాదిరిగా నీటి వనరులు లేకపోయినప్పటికి బావులవల్ల పంటలు పండించుకొని అందరితోబాటు అభివృద్ధి అవుతామని ఆశిస్తున్నారు. కాబట్టి ఆ స్కీమును అమలుపరచవలసిందని నేను మంత్రిగారిని తమద్వారా కోరుతున్నాను.

తిరువూరు స్కీమునుంచి విద్యుచ్ఛక్తిని ఖమ్మంమెట్టు జిల్లాలోని మధిర తాలూకాకుకూడా సరఫరా చేయడానికి ఏర్పాటు జరిగిందని తెలుస్తున్నది. ఆ ప్రకారం తిరువూరు తాలూకా అవతలకుకూడా poles వేయబడ్డాయి. మధిర తాలూకాలో ఉన్న అన్ని గ్రామాలకు విద్యుచ్ఛక్తి కావలసినదే. కాని ఈ poles పోతున్నటువంటి తిరువూరు తాలూకాలోని గ్రామాలలోనివారు కోరుతున్నప్పటికీ 'ఈ సంవత్సరం అవకాశం లేదు' అని ఆ గ్రామాలను వదలివేసి పై గ్రామాలకు electricity ఇచ్చినట్లయితే ఈ గ్రామాలవారు చాల బాధపడుతారు. కాబట్టి ఆ విధంగా కాకుండా ఏ గ్రామంలోనుంచి electricity lines పోతూవుంటాయో ఆ గ్రామాలలోని రైతులు కోరినట్లయితే, remunerative గా వస్తుందా ? లేదా ? ఎన్ని బావులు ఉన్నాయి ? ఈ బావులు వల్ల ఆదాయం వస్తుందా ? లేదా ? అనే విచారణలేకుండా ఆ గ్రామాలకు సప్లయి ప్రారంభిస్తే తరువాత ఎక్కువ బావులకు విద్యుచ్ఛక్తి ఈయవచ్చు. 10 బావులకు electrical engines ను పెట్టుకొనిన రైతులు ఆ బావులవల్ల లాభం పొందుతూవుంటే తతిమ్మావాళ్ళు కూడా పెట్టుకోడానికి ముందుకువస్తారు. దీనికంతాకూడా డబ్బు పెట్టుబడి పెట్టాలి. మెట్ట తాలూకాలలో ఉన్నటువంటి రైతులు చాల బీదవాళ్ళు. వాళ్ళు డబ్బు పెట్టుబడి పెట్టి pump sets తెచ్చుకోవడం చాలకష్టం. ఏదైనా లాభం వస్తోంది అంటే అప్పోసొప్పో తీసుకొచ్చి pump sets కొని బావులకు పెట్టుకొని ఉపయోగించుకొంటారు. కాబట్టి agreements విషయంలో, లెక్కప్రకారం agreements అన్నీ వచ్చినవా ? లేదా ? అని విచారించకుండా ఎంత ఎక్కువైనప్పటికీ గ్రామంలో ఎంతమంది కావాలంటే అంత మందికి విద్యుచ్ఛక్తి ఇచ్చేటట్లు చూడవలసిందని మంత్రిగారిని కోరుతూ ఇంతటితో సెలవు తీసుకొంటున్నాను.

శ్రీ పి. రాజగోపాలనాయుడు (తవనంపల్లి): అధ్యక్షా, ఈనాడు మన దేశం పారిశ్రామికంగా, వ్యవసాయికంగా అభివృద్ధి చెందాలంటే విద్యుచ్ఛక్తి ప్రధానమని సభ్యులందరు ఒప్పుకొన్నారు. మంత్రిగారుకూడా సెలవిచ్చినారు. అయితే విద్యుచ్ఛక్తిని అన్నిచోట్లకు సరఫరాచేయడానికి తగినంత డబ్బుమాత్రం లేదంటున్నారు. ఇది చాల అయోమయమైనటువంటి పరిస్థితిలో పడుతున్నది. మన రాష్ట్రానికి రెండో పంచవర్ష ప్రణాళికలో ప్రత్యేకించింది 20 కోట్ల రూపాయలు మాత్రమే. మద్రాసురాష్ట్రానికి 60 కోట్ల రూపాయలు కేటాయించినారు. దానితోపాటు వారికి కెనడా ఇచ్చినటువంటి సహాయంలో 12 కోట్ల రూపాయలు ఇచ్చినారు. మనం మొదటి పంచవర్ష ప్రణాళికలో ఖర్చుపెట్టినది 25 కోట్ల రూపాయలు. మొదటి పంచవర్ష ప్రణాళికలో ఎంతైతే ఖర్చుపెట్టినారో దానికి 25% హెచ్చుగా రెండవపంచవర్ష ప్రణాళికలో ఆయా రాష్ట్రాలకు ఇవ్వవలసిందని ఒకసూత్రాన్ని రూపొందించినారు. కాని ఆంధ్రరాష్ట్రం విషయంలో ఆసూత్రంఎంతమాత్రమూ అమలుపరచబడడంలేదు. 20 కోట్ల రూపాయలు మాత్రమే ఇచ్చినారు. 25% హెచ్చించేదానికి బదులు 4 కోట్లు తగ్గించినార్నమాట. అందువలన మనకు రావలసినటువంటి వాటా రాలేదనే చెప్పాలి. ఈనాడు మనం విద్యుచ్ఛక్తిని ఎక్కువగా ఉత్పత్తి చేసుకోవలసి ఉన్నది. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో సీలేరు ప్రాజెక్టును పూర్తిచేయాలి. ఆవిధంగా చేయలేకపోయినట్లయితే మనకు power shortage ఎక్కువ అవుతుంది. దానిని పూర్తిచేయాలని అనుకొన్నట్లయితే 5 కోట్ల రూపాయలు మనకు కావలసి ఉన్నది. గ్రామాలలో విద్యుచ్ఛక్తిని ఎక్కువ చేయాలంటే మనకు డబ్బు చాలతక్కువగా ఉన్నది. వచ్చేసంవత్సరంలో గాని, లేదా మరొక సంవత్సరంలోగాని మనకు డబ్బేలేని ప్రమాదపరిస్థితికూడా ఏర్పడబోతున్నది. దానికి మరొక అయిదుకోట్ల రూపాయలు కావలసివుంటుంది. అందువల్ల ఈనాడు ఆంధ్రరాష్ట్రంలో కావలసినది 10 కోట్ల రూపాయలు. అదికూడా చాలా తక్కువ. అయినప్పటికీ 10 కోట్లరూపాయలు ఇవ్వవలసినదని మన ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని అడిగిందని చెప్పారు. సంతోషమే. ఆ 10 కోట్ల రూపాయలు మనకువస్తేతప్ప మనం విద్యుచ్ఛక్తిని కనీసం కొంతఅయినా సరే అభివృద్ధి చేయడానికి వీలు ఉండదు. కనుక మంత్రిగారు ఈ విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధవహించి గట్టి ప్రయత్నం చేయాలని కోరుతున్నాను.

ఈనాడు shedule rates చాలా ఎక్కువగా ఉన్నాయి. అవికూడా commercial basis మీద జరుగుతోంది. 100 రు. లు ఖర్చుపెడితే దానినుండి 10 రూ.ల ఆదాయంవస్తేనేతప్ప పనిప్రారంభించడానికి వీలులేదని మన ప్రభుత్వం ఒక విధానాన్ని రూపొందించియున్నది. అందువల్ల rates ఎక్కువగా ఉన్నపుడు estitmate 10% నుంచి చాలా హెచ్చు కావలసి ఉంటుంది. కాబట్టి చాలా

Schemes un-remunerative అయిపోతున్నాయి. చాలామంది సభ్యులు ఈ అసెంబ్లీలోనే budget session లో shedule rates తగ్గించాలని చాలాసార్లు కోరి యున్నారు. మంత్రిగా ఉన్నటువంటి శ్రీ తిమ్మారెడ్డిగారు కూడా ఇదివరకే ఆందోళన చేశారు. ఇప్పుడు కూడా ఆందోళన చేస్తున్నారు. Scheduled rates తగ్గించినట్లయితే తప్పనిసరిగా 10% remunerative గా వుంటుంది. దానిని తగ్గించడానికి వీలుంటుంది. కాని, మరొక మార్గం కూడ ఆలోచించాలి. ఇప్పుడు 10 సం.ల వరకూ guarantee తీసుకొన్నట్లయితే డబ్బంతా వసూలు చేయడానికి వీలుంటుందని నేను అనుకొంటున్నాను. 15 సం. లు అయినాసరే guarantee తీసుకొని percentage తగ్గించినట్లయితే మనంతప్పనిసరిగా ఎక్కువ స్కీములకు అమలు చేయడానికి వీలుంటుంది. కాబట్టి అలాంటి విధానాన్ని రూపొందించాలని నేను కోరుతున్నాను. గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి మరొక ప్రతిబంధకం కూడా యున్నది. Corporations ఉండడంవల్ల చాలా చిక్కుగా ఉన్నది. Corporation కు సరైన ఆర్థికస్థోమతులేదు. అందువల్ల Corporation limits లో ఉన్న గ్రామాలలో ఒకదానికి కూడా వారు ఈనాడు విద్యుచ్ఛక్తి సరఫరా చేయలేకుండా ఉన్నారు. ఉదాహరణకు ఒక విషయం చెబుతాను. చిత్తూరు కార్పొరేషన్ తీసికొన్నట్లయితే వారు 3,4 ఏండ్లనుంచి, ఇంతవరకూ ఏలాంటి అభివృద్ధినీ సాధించలేదు. 5 మైళ్ళు పర్యంతం connections ఇవ్వడానికి వీలులేకుండా ఉన్నది. ప్రభుత్వం 5 మైళ్ళలో connections యివ్వడానికి వీలు లేకపోతే 5 మైళ్ళకు అయ్యేఖర్చు 6 వ మైలులో ఉన్నవారి మీద పడుతుంది. అందువల్ల unremunerative అయిపోతుంది. అందువల్ల ఈ Corporations ను తొలగించాలనే విధానాన్ని ప్రభుత్వం రూపొందించింది. ఇదిసంతోషదాయకమైన విషయం. చిత్తూరు కార్పొరేషన్ ను కూడా తీసుకోవాలి. తిరుపతి కార్పొరేషన్ తీసికొన్నారు. సంతోషమే. అలాగే చిత్తూరు కార్పొరేషన్ కూడా తీసికోవాలని ప్రభుత్వం అనుకొన్నప్పటికీ ఇంతవరకూ అది తీసుకోబడలేదు. ఇప్పుడైనా ఆ కార్పొరేషన్‌ను తీసుకోవాలని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తిరుపతి కార్పొరేషను తీసుకొన్న తరువాత రామలపల్లి, కమ్మపల్లి మున్నగు గ్రామాల లోని రైతులు, ఇంకా యితరగ్రామాలవారు మోటారులు తెచ్చిపెట్టుకొన్నారు. ఇప్పటికీ వారికి connections యివ్వడానికి వీలులేకుండా వున్నది. కాబట్టి వెనువెంటనే వారికి connections ఇవ్వడానికి ప్రయత్నం చేయాలని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఈ పనులన్నీ contractors కు యిచ్చేదానికంటె డిపార్టుమెంటువారే చేయడం మంచిదని నేను అనుకొంటున్నాను. డిపార్టుమెంటువారు పనిచేసే ప్రాంతాలలో ప్రతిభావంతంగా పనిసాగుతున్నది. కొన్నిచోట్ల contractors కు ఇచ్చారు. contractors యింతవరకూ main lines వేయలేదు. Distribution

lines వేస్తున్నారు, కాని main lines వేయకపోవడం వలన connections యివ్వడానికి వీలులేకపోతోంది. అంతేకాకుండా మనకు ఉండే డబ్బు వృధాగా అయిపోతోంది. Department లో తర్ఫీదుపొందినవారు చాలమంది ఉన్నారు. అందువల్ల contractors కు ఇవ్వకుండా Department వారినే engage చేసినట్లయితే లాభదాయకంగా వుంటుందని నేను అభిప్రాయపడుతున్నాను. కాబట్టి contractors కు ఇవ్వకుండా అన్ని lines కూడా Department వారే వేసేటట్లు ప్రయత్నం చేయాలని కోరుతూ నేను విరమిస్తున్నాను.

*శ్రీ యన్. సి. శేషాద్రి (రాయదుర్గం) : అధ్యక్షా, ఈనాడు మనం అతి ముఖ్యమైన డిమాండుపైన చర్చిస్తున్నాము. మన దేశప్రణాళికలోనూ, రాష్ట్రప్రణాళికలలోనూ కూడ నీటి పారుదల సౌకర్యాల తరువాత విద్యుచ్ఛక్తి సరఫరాకు మనం ప్రాధాన్యత ఇస్తున్నాము. మంత్రిగారు తమ ప్రారంభోపన్యాసంలో విద్యుచ్ఛక్తి సరఫరా మొదటి పంచవర్ష ప్రణాళికా కాలానికి ముందునుంచీ ఏ విధంగా అభివృద్ధిచెందినదీ, 1951వ సం॥ లో per capita consumption ఏవిధంగా 2.5 నుంచి 1954కు 5 units వచ్చిందీ. ఆ తరువాత ప్రస్తుతం 10 units వచ్చిందీ మున్నగు విషయాలను వ్యక్తపర్చారు. ఇందులో వారేమీ అతిశయోక్తిగా చెప్పలేదు. అయితే మన ప్రక్కనే ఉన్న మద్రాసు రాష్ట్రంలో percapita consumption ఈ సంవత్సరం 25 units దాకా ఉంది. మైసూరురాష్ట్రంలో 45 units దాకా వున్నది. ఇరుగు పొరుగు రాష్ట్రాలలోని పరిస్థితి ఈ విధంగా ఉన్నది. మనం కేవలం 10 units మాత్రమే per capita consumption పెట్టుకొని ఉన్నట్లయితే రైతులలో చాలానిరుత్సాహముంటుందని నేను భావిస్తున్నాను.

అదేకాకుండా rural electrification programme కుంటుపడడానికి ప్రధానంగా మూడు కారణాలున్నాయని నేను భావిస్తున్నాను.

మొదట ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు విద్యుచ్ఛక్తి produce చేసుకోడానికి కావలసినటువంటి సామాగ్రి మన దగ్గర లేకపోవడం, అందువల్లనే మనం తుంగభద్ర జలవిద్యుచ్ఛక్తి కేంద్రాన్ని, మాచ్‌ఖంజడ్ జలవిద్యుచ్ఛక్తి కేంద్రాన్ని తరువాత సీలేరు మొదలైన పెద్దపెద్ద ప్రాజెక్టులను తీసికొని Copital oultay దానిపైన ఎక్కువగా పెట్టుకోవడం జరుగుతున్నది. అందువల్లనే గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా పథకాలు కొంతవరకూ కుంటుపడుతున్నాయని మనం అనుకోవలసి వుంటుంది.

రెండవది percentage of returns అనే విషయం. Load density అనే కారణం వల్ల percentage of return సరిగా ఉంటే తప్ప rural electrification schemes ను తీసుకోడానికి వీలులేదని ప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చినందువల్ల

rural areas లో load density సరిగా లేకుండా ఉండడం వల్ల కూడా మన rural electrification schemes కొంతవరకూ దెబ్బతింటున్నాయి. అయితే ఈ విషయమై Planning Commision వారు కొన్ని సూచనలు చేశారు. కాని ప్రభుత్వం ఆ సూచనలను ఎందువల్ల తీసుకోలేదో నాకు అర్థంకావడం లేదు.

"For rural electrification sehemes, it may not always be possible to apply the usual yardstick of financial returns. In special cases, where electricity would provide large benefits to the community, the State Governments, subject to their finances permitting, may even sponsor schemes which are not expected to be self-supporting within the usual period of ten years."

ఈ పైవిధంగా అన్ని రాష్ట్రప్రభుత్వాలకూ కూడా Planning Commission వారు clear గా సూచించారు. మనం ఒకే దృష్టి పెట్టుకొని 10% return వస్తే కాని schemes తీసుకోడానికి వీలులేదు అనేటట్లయితే, బహుశా 10 సం. లు అయినప్పటికీ కూడా గ్రామీణ ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి సరఫరా కాదని నేను భావిస్తున్నాను. ఆ ప్రకారంగానే పెద్ద schemes తయారుచేసేటప్పుడు కొన్ని commercial loads తీసికొని వాటితో పాటు agriculture loads కూడా తీసికొన్నట్లయితే remunerative గా work జరగడమే కాక గ్రామీణ ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి వాడుకోడానికి వీలుంటుందని నేను భావిస్తున్నాను. రాయలసీమ డెవలప్‌మెంటు కమిటీ ఒకటి ఉన్నది. ఆ కమిటీ గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరాకు సంబంధించినంతవరకూ 10% returns అని పెట్టుకుంటే load density రాదు. కాబట్టి 8% దాకా తీసుకోవలసినదని వారుకూడా తీర్మానాలు చేశారు. అప్పటి ప్రభుత్వం record చేసినది. అనంతపురం జిల్లా ప్లానింగు కమిటీలో కూడా రిజల్యూషన్సు చేసి పంపించాము. అవి ప్రభుత్వం దృష్టికి వచ్చేఉంటాయి. అవి వచ్చినట్లయితే ప్రభుత్వం ఎందుకు అమలుచేయటంలేదో నాకు అర్థంకాకుండా ఉన్నది.

ఇంక రెండవ కారణమేమంటే, ఈనాడు మన Budget లెక్కలు పరిశీలించి చూచినట్లయితే distribution of power అనే head క్రింద మాచ్‌ఖండ్‌కు రు. 1,92,30,800 లు, తుంగభద్రకు రు. 69,28,500 లు, చిత్తూర్ థర్మల్ స్కీముకు రు. 8,48,700 లు. నెల్లూరు థర్మల్ స్కీముకు 2 లక్షల రు.లు. ఈ విధంగా కేటాయించుతూ వచ్చారు. ఈ Distribution of Power కు గాను 2 కోట్ల 71 లక్షల చిల్లర రూ.లు కేటాయించారు. ఇందులో దాదాపు Industrial connections కు ఎక్కువ ఖర్చుపెడుతున్నారు. అంటే దాదాపు 80 లక్షల రూ.ల వరకు ఖర్చుపెడుతున్నారు. అందులో ఆదోని స్పిన్నింగ్ మిల్సు, పామిడి సిమెంట్సు, గరివిడి ఫెర్రో మాంగనీస్ మైన్సు, కాల్‌టెక్స్ రిఫైనరీస్, చిట్టివలస జూట్‌మిల్సు వంటి వాటికిగాను, అంటే మనం ఈ

Distribution of Power కు గాను కేటాయించిన మొత్తంలో దాదాపు మూడింట ఒక భాగంలో industrial connections కు వినియోగిస్తున్నాం అన్న మాట. ఈ industrial connections కు యింత యివ్వడంవల్ల దాదాపు ఒక కోటి రూ.ల వరకు లాభం వస్తుందని మంత్రిగారు సెలవిచ్చారు. మన రాష్ట్రానికి ఈ విధంగా ఆర్థికంగా కొంత అభివృద్ధి కలుగుతున్నదంటే తప్పకుండా సంతోషించవలసిందే. అయితే ఈ మూడింట ఒక భాగం దాంట్లో తీయడంవల్ల మన rural electrification programme కొంత suffer అవుతుందేమోనని నేను భావిస్తున్నాను. ఏదైతే పెద్ద పెద్ద మొత్తాలకు సంబంధించిన schemes ప్రభుత్వం అమలుపరచదలచుకుంటుందో, ఆ కనీస మొత్తాలను మనం కేంద్రప్రభుత్వము నుంచి అదనంగా తెచ్చుకొని, దాన్ని వాడుకున్నట్లయితే, మన distribution of power కు ఎంత డబ్బు అయితే వాడవలసి ఉంటుందో దాన్ని అప్పుడు rural electrification కు వాడడానికి వీలుగా ఉంటుందని ప్రభుత్వానికి సూచిస్తున్నాను.

తరువాత State Electricity Board గురించి చెప్పారు. ఇది మనకు చాలా అవసరం. మైసూరు రాష్ట్రంలోకూడా యిది ఉన్నది. అంతే కాకుండా మన ప్రణాళికా భాగంలో దాదాపు 46% ఈ విద్యుచ్ఛక్తి, నీటిపారుదల సౌకర్యాలకు మనం ఖర్చుపెడుతున్నాం. ఈ రోజున నాగార్జున సాగర్ బోర్డు ఏ విధంగా ఉందో అదేవిధంగా మనం State Electricity Board ను వేసుకున్నట్లయితే ఎవరితోను సంబంధంలేకుండా ఒక ఇండిపెండెంట్ బాడీగా ఉండి మన కార్యక్రమాలను సక్రమంగా చేసుకోవడానికికూడా వీలుగా ఉంటుంది. మంత్రిగారు చెప్పినదాంట్లో industries కు ఎంత power యివ్వాలనే విషయం ఆ బోర్డు యోచించదలచుకున్నట్లుగా ఉన్నది. (Interruption) అదేమీ లేదా ? నేనావిధంగా అనుకున్నాను. మరొక విషయంగురించి చెబుతాను.

నా నియోజకవర్గంలోఉన్న schemes గురించి రెండుమాటలు చెబుతాను. రాయదుర్గం తాలూకాలో పల్లేపల్లి దాని పరిసర గ్రామాలకు, తరువాత నేత్రపల్లి దాని పరిసరగ్రామాలకు సంబంధించిన 8లక్షల రూ. విలువచేసే 2స్కీములు ప్రభుత్వం సుమారు 9నెలల క్రిందట శాంక్షన్ చేసింది. 9 నెలల క్రిందట sanction చేసి, పోయిన దఫా మాకు యిచ్చిన supplementary demands లో దానికి ఒక token grant 100 రూ.ల దాకా కేటాయించడం జరిగింది. అప్పటి నుంచి యిప్పటివరకు నేను మంత్రిగారికి 2,3 ఉత్తరాలు వ్రాశాను. మొదటి ఉత్తరానికి "యిప్పుడు ఉండే ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా ఇది సాధ్యంకాదు" అన్నారు. తరువాత కనీసం ఒక్కొక్క స్కీములో రెండు గ్రామాలైనా తీసుకోవలసిందని నేను Chief Engineer గారికి వ్రాశాను. కాని దానికి జవాబు తిరిగిరాలేదు. కనుక ప్రభుత్వంవారిని ఈ విషయంలో ప్రత్యేకంగా అభ్యర్థించదలచుకున్నామంటే,

ఎక్కడైతే శాంక్షన్ అయిన స్కీములున్నవో, అక్కడ వాటిని పూర్తిగా అమలుపరచకపోయినా కనీసం ఒక్కొక్క స్కీములో రెండు గ్రామాలైనా తీసుకోవలసియున్నది. ఈవిధంగా చేసినట్లయితే ప్రజలలో కొంత ఆందోళన తగ్గడానికి అవకాశంఉంటుంది. అంతేకాకుండా కల్యాణదుర్గం, అనంతపురం జిల్లాలలో అనేక తాలూకా Head-quarters కు కూడా విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది; ఒక్క ఆలూరు, మడకసిరతాలూకాలకుతప్ప. మడకసిర తాలూకా గురించి మా సోదరి శ్రీమతి రుక్మిణీదేవి గారు చెప్పారు. కల్యాణదుర్గంలో విద్యుచ్ఛక్తి సరఫరాకు 26 లక్షల scheme ప్రభుత్వ పరిశీలనలో నున్నట్లు తెలుస్తున్నది. ఒక్క కల్యాణదుర్గం టౌన్‌కే కాకుండా దాదాపు 40 గ్రామాలకు సంబంధించిన scheme అది. అది ఈ సం. పూర్తిగా అమలుపరచడానికి వీలులేకపోతే Supplementary Budget లో నైనా దానికి కొంత డబ్బు కేటాయించి, 2, 3 గ్రామాలైనా తీసుకుంటే చాలా బాగుంటుందని నేను భావిస్తున్నాను. ఈ కల్యాణదుర్గం ఎక్కువ lift irrigation పై ఆధారపడిన ప్రాంతం. ఒక్క రాయదుర్గం తాలూకాలోనే 12వేల బావులున్నాయి. ఆ 12 వేల బావుల్లో దాదాపు 3 వేల ఆయిల్ యింజన్‌లతో ఈరోజున అక్కడ వ్యవసాయ కార్యక్రమాన్ని సాగిస్తున్నారు. ఒక్కొక్క oil engine పెట్టుకొనడానికి 1000రూ. లేక 1500 రూ. ల వరకు ఖర్చుఅవుతున్నది. ఆ తాలూకా ప్రక్కనే 3 మైళ్ళు అవతల ఉన్న మైసూరురాష్ట్రంలో వాళ్లకు 3 కానులకు ఒక యూనిట్ చొప్పున విద్యుచ్ఛక్తి సరఫరా అవుతున్నది. అంత దగ్గర ప్రాంతంలో వాళ్లకు అంత cheap గా electricity supply అవుతుంటే, ఈ తాలూకా ప్రజలు "అరే... ! మేమెంతో బాధపడవలసివస్తుంది. మా ప్రక్కనే ఉన్నవారు ఆ విధంగా అనుభవిస్తున్నారు, sanction అయిన స్కీములే యింతవరకు అమలుపరచుకున్నారు" అని ఎంతో బాధపడుతున్నారు. అటుతరువాత Electricity Department లో నాకు తెలిసినంతవరకు Superintending Engineer గాని, Chief Engineer గాని, ప్రజాప్రతినిధులు ఎక్కడకు పోయినా చాలా ఆదరణతో వాళ్ళందరినీ బాగా విచారిస్తున్నారు. ఆ విషయంలో సందేహమేమిలేదు. ముఖ్యంగా మా అనంతపురం Superintending Engineer శ్రీ పార్వతీశంగారుగాని, యింకెవరైనా యితరులుగాని మా గ్రామాలకు వచ్చినప్పుడు మమ్ములను పిలిచి, మా తాలూకాలో ఉన్న schemes యేమో, మా అవసరాలేమో కనుక్కుంటున్నారు. తరువాత వారికి అనుకూలమైనరీతిగా వాటిని అమలు జరుపుతున్నారు. లక్ష రూ.ల పైనఉన్న పెద్ద schemes ను కాకపోయినా కనీసం 30,40 వేల రూ.లు గల చిన్న schemes నైనా వెంటనే మంజూరు చేయించాలి. రాయదుర్గం తాలూకాలో భూతీయదొడ్డికి 40 వేల రూ. ల scheme ఉంది. కనీసం ఈ స్కీమునైనా ఈ సంవత్సరం బడ్జెట్‌లో include చేయవలసిందని మనవి చేశాను. Chief Engineer గారికి కూడా చెప్పుకున్నాను. సుమారు 30 agricultural

loads దొరికే ఆ గ్రామపుస్కీము ఆర్థికాభావంచేత తీసుకోడంలేదని చెప్పడం సబబుగాదని మనవిజేస్తున్నాను. కనుక లక్షలు ఖర్చుపెట్టే schemes మాట అటుంచి ఇటువంటి చిన్నచిన్న schemes నైనా అనులుపరచి గ్రామీణ ప్రాంతాలకు ముఖ్యంగా lift irrigation ప్రాంతాలకు సహాయం చేసినట్లయితే బాగుంటుంది. తరువాత మా తాలూకాకు సంబంధించి 20 లక్షల రూ.ల స్కీము పరిశీలనలో నున్నది. ఈ 20 లక్షల రూ.లు ఇవాళ శాంక్షన్ చేసినప్పటికీ దానికి గాను సంవత్సరానికి 4,5 లక్షల రూ.లు ఖర్చుపెట్టవలసిందే. కనుక యీవిషయాలన్ని తిరిగి మంత్రివర్యులు ఆలోచించి, వెంటనే స్కీములు అమలుచేయగలరని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

శ్రీ బసవ మానయ్య (అంధోలు) : అధ్యక్షా, ఈ విద్యుచ్ఛక్తికి సంబంధించిన పద్దుపై మాట్లాడడానికి సమయం యిచ్చినందుకు తమకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

* ఈ పద్దుకు కేటాయించిన మొత్తాన్ని నేను చిత్తశుద్ధిగా ప్రతిఘటిస్తున్నాను. 800 గ్రామాలలో ఈ విద్యుచ్ఛక్తి వ్యవస్థ తేబడిందని పూజ్యులైన మంత్రిగారు తెలిపినారు. మా జోగిపేటలో 10 వేల జనసంఖ్య ఉన్నది. పురపాలక సంఘం కలదు. మంచి వ్యాపార కేంద్రం. 10 వేల రూ॥లు Town Committee నుంచి ప్రభుత్వానికి యివ్వబడునని తీర్మానం చేసి పంపబడింది. ప్రజలుకూడా దరఖాస్తులు పెట్టుకున్నారు. కాని యింతవరకు ఆవ్యవస్థ అక్కడ ఏర్పడలేదు. వికారాబాదులో ఈ విద్యుచ్ఛక్తి వ్యవస్థ స్థాపన జరిగింది. అయితే పల్లెటూళ్ళలో జనసంఖ్య ఎక్కువనే విషయం మనకందరకూ తెలిసిందే. మన నిజాంసాగర్‌లో విద్యుచ్ఛక్తి తయారై హైదరాబాదు శికింద్రాబాదు నగరాలకు వస్తున్నది. అందులో పల్లెటూళ్ళకు వినియోగించాలని యున్నా ఆ విధంగా దానిని పల్లెటూళ్ళకు యేమాత్రం వినియోగించడం లేదు. మొదట పంచవర్ష ప్రణాళికలోను, రెండవ పంచవర్ష ప్రణాళికలోను ఈ వ్యవస్థ గురించి ఎంతో డబ్బుఖర్చు కనబడుతున్నది. పుస్తకాల్లోను, బయటను దీనినిగురించి సుదీర్ఘమైన ఉపన్యాసాలు వినబడుతున్నాయి. మా నియోజక వర్గంలో ఉన్న శంకరంపేట చాలా పెద్ద గ్రామం. పాపన్నపేట కూడా పెద్దదే. ఇటువంటి పెద్ద గ్రామాలకు వెళ్ళి చూచినా ఈ విషయంలో యేమీ పని జరిగినట్లు కనిపించదు. హృదయానికి ఎంతో ఖేదమనిపిస్తుంది. ప్రభుత్వానికి పన్ను వచ్చేదంతా పల్లెటూళ్ళనుంచే. కాని ఖర్చుపెట్టడం మాత్రం పట్టణాలలోనే కనబడుతున్నది. గాని పల్లెటూళ్ళకు యేమాత్రం చేయడంలేదు.

గాంధీగారు పల్లెటూళ్ళను బాగుచేయాలని చెప్పారు. కాంగ్రెసువారి ఉద్దేశ్యముకూడ అదే. ప్రతి పార్టీవారియొక్క ఉద్దేశ్యము అదే. ప్లానింగు

కమిషన్ చెప్పినది అదే. కాని యీ అభిప్రాయాలను ఆచరణలో ఎంతవరకూ పాటిస్తూన్నారనేదే గమనించవలసిన విషయం. ఎన్ని గ్రామములవారు కోరినప్పటికిన్నీ ప్రభుత్వంవారు గ్రామాలకు విద్యుచ్ఛక్తిని ఇవ్వడంలేదు. కాన్‌స్టిట్యూయెన్సీ బేసిస్‌మీద యీ స్కీములను అమలు చేసినట్టయితే చాలా బాగుంటుంది. అట్లాకాకుండా ఇష్టమున్నచోట్ల స్కీములనిచ్చి అవసరమైన ఇతర ప్రదేశములలో స్కీములను శాంక్షన్ చేయక పోయినట్లయితే ఆ వ్యవస్థ ఏర్పడుతుందని మనవిచేస్తున్నాను. అవసరమున్న స్థలములలో రాలేదని ప్రజలు అనుకొనే అవకాశముండదు. దీనిని ముఖ్యంగా దృష్టియందుంచుకుని కాన్‌స్టిట్యూయెన్సీగా స్కీములను అమలు జరుపవలెనని కోరుతున్నాను. గత హైదరాబాదు ప్రభుత్వములో ఉన్నప్పుడు ఎగ్బోటేగారి అధ్యక్షతన హైదరాబాదు పురపాలక సంఘాధ్యక్షుల సమావేశము జరిగినది. అప్పుడు మాఅంధోల్ కానిస్టిట్యూయెన్సీలోని జోగిపేటలో ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలోనే విద్యుచ్ఛక్తి ఏర్పాటు చేయవలెనని, అందుకుగాను 10 వేల రూపాయలు మా పురపాలక సంఘము యివ్వాలని తీర్మానము చేయబడింది. ఇప్పుడు ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఐపోయింది. రెండవపంచవర్ష ప్రణాళికా కాలంలో 1 సంవత్సరం గడిచింది. ఐనప్పటికీ కూడ యింతవరకూ అక్కడవిద్యుచ్ఛక్తి సరఫరా చేయబడలేదు. నిజాం సాగరునుంచి వచ్చే విద్యుచ్ఛక్తికి అక్కడ ఒక సబ్‌స్టేషన్‌ను ఏర్పాటుచేస్తామని అన్నారు. మూడు నాలుగు మాసములక్రిందట చెప్పారు. పోయిన ఆదివారము ఎలెక్ట్రికల్ శాఖపక్షమున ఒకరిద్దరు ఆఫీసర్సు వచ్చి ఆంధ్రనుంచి కొన్ని ఆయిల్ ఇంజన్సు వస్తున్నాయని సదాశివపేటలోగాని, జోగిపేటలోకాని ఏర్పాటు చేయబడుతాయని ఎవరెవరికి ఎంత విద్యుచ్ఛక్తి అవసరమో, గిర్నీలకు, దుకాణాలకు, ఇండ్లకు ఎంతెంత కావలెనో అడిగారు. కాని 1958 మార్చినాటికి యీ పని అయిపోతుందని చెప్పారు. ఐతే యీ 8, 9 మాసములలో యీ పని అంతా జరుగుతుందనేది నమ్మలేక ప్రజలు విభ్రాంతి పడుతున్నారు. ప్రజలకు అవసరమైన యీ విద్యుచ్ఛక్తి సౌకర్యాలను త్వరలో గ్రామాలలో కలుగచేయవలెనని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ. పి. శ్రీరాములు (దుగ్గిరాల) : అగ్రాసనాధిపతీ, విద్యుచ్ఛక్తి పద్దును సమర్థిస్తున్నాను. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంనుంచి ఆంధ్ర జిల్లాలు విడివడి ఆంధ్ర ప్రాంతము వేరుగా ఒక రాష్ట్రముక్రింద ఏర్పడినంతవరకూ ఆంధ్ర జిల్లాలలో ఎలక్ట్రిసిటీ సరఫరా విషయంలో చాలా వెనుకబడిఉండేది. ఆంధ్ర రాష్ట్రము ఏర్పడినది మొదలు విశాలాంధ్రగా రూపొందేవరకూ కూడా మన ఆంధ్ర ప్రభుత్వము విద్యుచ్ఛక్తి విషయంలో ప్రత్యేకమైన కృషిని చేసి విద్యుచ్ఛక్తిని గ్రామప్రాంతాలకు కూడా విస్తరింపచేసే విషయంలో ప్రత్యేక శ్రద్ధను చూపినది. విశాలాంధ్ర ఏర్పడిన తర్వాత యీ విషయములో ఇంకనూ వెనుక

బడిఉన్న తెలంగాణా జిల్లాలను అభివృద్ధిపరచడం ఎంతైనా అవసరము. తెలంగాణా ప్రాంతమునుంచి వచ్చినటువంటి గౌరవసభ్యులు యీ శాఖకు మంత్రిగా రావడము ఆంధ్రప్రదేశానికంతకూ ప్రత్యేకంగా విశాలాంధ్రకు చాలా సంతోషకరమైన విషయం. ఐతే ఒక సంగతిని గుర్తించుకోవాలని సవినయంగా మనవి చేస్తున్నాను. విద్యుచ్ఛక్తి సరఫరావిషయంలో గాని నీటి పారుదల విషయంలో గాని వెనుకబడిన ప్రాంతాలకు వెనుకబడిన జిల్లాలకు ప్రాధాన్యత, శ్రద్ధ చూపించవలసిన అవసరంఉన్నది. ఎక్కువ సొమ్మును కేటాయించి ఆ ప్రాంతములలోని పథకములను కొనసాగించవలసి ఉన్నది. ఎలెక్ట్రిసిటీ సరఫరా విషయంలో ప్రభుత్వం ఒక ప్రధానమైన సూత్రమును పెట్టుకున్నది. యీ స్కీములను కమర్షియల్ బేసిస్ మీద నూటికి 10 రూపాయలు ఆదాయము వచ్చేటట్లయితేనే శాంక్షన్ చేయవలెననే పద్ధతిపై కొనసాగిస్తున్నది. పెట్టుబడిపైన 10 శాతము ఏటా ఆదాయము రావలెననే నిబంధనను ఆధారం చేసుకొని ఎస్టిమేట్సును తయారుచేయడం జరుగుతున్నది. 10 శాతము ఆదాయము రానటువంటి కారణాన ఎన్నో స్కీములు మంజూరు చేయకుండా త్రోసివేయబడు తున్నాయి. స్కీము శాంక్షన్అయి పని ప్రారంభించిన అనంతరం నూటికి 10 రూపాయలే కాక 20 రూపాయల వరకూ వచ్చే స్కీములు కూడా, ఆంధ్ర ప్రభుత్వంలో శాంక్షన్ చేయబడినప్పటికీ, ఇంతవరకూ అమలు చేయలేదు. ఒక ప్రక్కన మనము డబ్బు ఖర్చు పెడితే వెంటనే రిటరన్ రావలెనని అంటున్నాము. కాని మరొకప్రక్కన రిటరన్ వచ్చే స్కీములను కూడా శాంక్షన్ అయి రెండు సంవత్సరములు అయినప్పటికీ అమలు జరుపడంలేదు. యీ రెండు పద్ధతులకు పరస్పర వైరుధ్యం కన్పిస్తున్నది. ప్రజలు ముందుకు వచ్చి విద్యుచ్ఛక్తి కావాలని అడిగినప్పుడు, ఆ స్కీము లాభసాటిగా ఉన్నప్పుడు వాటిని ప్రారంభింపవలసిన బాధ్యత ప్రభుత్వముపై ఉన్నది. లాభసాటిగా ఉండి శాంక్షన్ అయిన స్కీములను వెంటనే ప్రారంభిస్తే ప్రభుత్వానికి ఆదాయము వస్తుంది. మనకు నష్టములేకుండా లాభదాయకముగా ఉన్నప్పుడు ఆ స్కీమ్సును ప్రత్యేకంగా అమలుచేసి తద్వారా ప్రతిఫలం పొందడం అవసరం. గ్రామ ప్రాంతములలో విద్యుచ్ఛక్తిని సప్లయి చేయడం అవసరమని తమద్వారా యీ శాఖ మంత్రిగారికి సవినయంగా మనవిచేస్తున్నాను. గుంటూరు జిల్లాలో తెనాలి—కొల్లిపర స్కీము ఉన్నది. 20 గ్రామాలకు సంబంధించిన స్కీము ఇది. కొల్లిపర, కొల్లూరు ఫిర్కాలలో గ్రామములు అందులో ఉన్నాయి. శాంక్షన్ అయి రెండు సంవత్సరములయినది. యీ స్కీమును వెంటనే అమలుజరిపితే నూటికి 10 రూపాయలేకాదు, నూటికి 20 రూపాయల వరకూ సర్వీసెస్ ఇచ్చినది లగాయతు ఆదాయము రాగలదని లెక్కలు చూపి రుజువు చేయగలను. తెనాలి—రేపల్లె స్కీమున్నది. అలాగే తెనాలి—చుండూరు స్కీమున్నది. డబ్బు లేదనే కారణంచేత వీటిని

అమలు జరుపలేదు. వీని విషయంలో మంత్రిగారికి ఒక సూచన చేస్తున్నాను. శాంక్షన్ చేసిన స్కీములకు అక్కడున్న ప్రజలు ముందుకు వచ్చి లోన్సు ఇచ్చేట్టయితే ప్రభుత్వము ఆ స్కీములను అమలు చేయడానికి ప్రయత్నిస్తుందని చెప్పారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో రాజాజీ ప్రభుత్వంలో ఇటువంటి పద్ధతి ఉండేది. అక్కడ ప్రజలు ప్రభుత్వానికి లోన్సు ఇవ్వాలి. ప్రజలు వారంతటవారే లక్షల రూపాయలు అప్పుగా యిచ్చేబదులు, ఆ మొత్తమును మూడు సంవత్సరములలో తిరిగి ఇచ్చే విధముగా బ్యాంకులనుంచి తీసుకోవడం మంచిది. మొత్తము సొమ్మునంతనూ భరించకుండా ఆ మొత్తమును బ్యాంకులు వారికి అప్పుగా యిచ్చి, కేవలం డిఫరెన్సుగా ఉండే 2 శాతము మొత్తమునే వారు చెల్లించే అవకాశము వుంటుంది. మూడు సంవత్సరములలో ప్రభుత్వము ఆ అప్పులను బ్యాంకులకు తీర్చివేయవచ్చు. ఇటువంటి పద్ధతిమీద ప్రభుత్వానికి ఇవ్వడానికి సిద్ధముగా ఉంటారు. ప్రజలకు కూడా అంత కష్టము లేకుండా ఉంటుంది. యీ సూచనను గమనించవలసినదని కూడా మంత్రిగారిని సవినయముగా ప్రార్థిస్తున్నాను. శాంక్షన్ అయిన స్కీములకు ఎగ్జిక్యూషన్ ఆరంభం చేయటంలో కొంతవరకు సామానులను డ్రా చేయడం జరిగిన తరువాత తిరిగి వాటిని విత్‌డ్రా చేయమని ఆర్డర్లు వస్తూవున్నాయి. ఆ విధంగా చేయడం వల్ల ప్రభుత్వానికి ఎంతో నష్టంఅవుతుంది. ప్రజలలో నిరుత్సాహం ప్రబలుతుంది. తెనాలి—కొల్లూరు, తెనాలి—చుండూరు స్కీములను వెంటనే ఎగ్జిక్యూట్ చేయించమని మంత్రిగారిని నేను కోరుతున్నాను. శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డిగారు చెప్పినట్లు స్కీములకు డబ్బు శాంక్షన్ చేయనిదే వాటికి ప్రచారం ఇవ్వడంవల్ల శాసన సభ్యులకు పెద్ద ఇబ్బందిగా ఉందని మనవిచేస్తున్నాను. డబ్బు శాంక్షన్ అయిన అనంతరమే యీ స్కీముల గురించి ప్రకటించడం మంచిది. లేనిచో ప్రజలలో అవిశ్వాసము ప్రబలటానికి అవకాశము ఏర్పడుతుందని మనవి చేస్తున్నాను.

ఈనాడు రాష్ట్రప్రభుత్వానికి Second Five Year Plan లో Electricity Scheme క్రింద sanction అయినటువంటి మొత్తం ఇదివరకే ఖర్చుఅయింది. దీనికి కారణం, గరివిడి, తుంగభద్ర, మాచ్‌ఖండ్ మొదలగు పెద్దపెద్ద స్కీములకు ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టి, మిగిలిన స్వల్ప మొత్తము ఈ rural electrification కు చాలడంలేదని తెలుస్తున్నది. కనుక కేంద్రప్రభుత్వంవారు ఈ rural electrification యొక్క ప్రత్యేక అవసరాన్ని గమనించేటట్లు, మన రాష్ట్రప్రభుత్వము కేంద్రముపై వొత్తిడిచేసి, వారినుండి rural electrification కు కావలసిన మొత్తమును grant రూపంగా గాని, లేక loan రూపంగాగాని తెచ్చి ఈ sanction అయినటువంటి schemes ను execute చేసి, తద్వారా ప్రజలకు సౌకర్యము కలుగచేసి ప్రభుత్వము return ద్వారా ఆదాయాన్నికూడ వచ్చేటట్లు చేయగోరుతూ విరమిస్తున్నాను.

శ్రీ జి. యలమందారెడ్డి : ఉపాధ్యక్షా, ఇంతకుముందు మన మంత్రిగారు demand ను ప్రతిపాదిస్తూ అనేక విషయాలు తెలియచేశారు. అంతకుముందు, ప్రభుత్వ సమాచార శాఖవారు ఈ కరపత్రాల ద్వారా అందించినటువంటి అనేక విషయాలుకూడ మనకు తెలుసు. దీనినిబట్టి చూస్తే ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో మన విద్యుచ్ఛక్తి చాలా తక్కువగా కేటాయించబడిందనేది స్పష్టంగా కనిపిస్తున్నది. అందులో ప్రథమ పంచవర్ష ప్రణాళికలోకంటెకూడా దీంట్లో, మన రాష్ట్రానికి చాలా తక్కువ కేటాయించారు. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో 25 కోట్లు కేటాయిస్తే, ఇప్పుడు 20 కోట్లు మాత్రమే కేటాయించడం జరిగింది. కాని ఇతర రాష్ట్రాల విషయంచూస్తే, ఆ యా రాష్ట్రాలకు ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఎంతైతే కేటాయించారో అంతకంటె జాస్తీగా ఇప్పుడు, రెండవ పంచవర్ష ప్రణాళికలో కేటాయించారు. పారిశ్రామికంగా దేశాన్ని ముందుకు తీసుకురావడానికి విద్యుచ్ఛక్తి చాలా ప్రధానమైనటువంటిది కాబట్టి ఈ రకంగా రెండవ పంచవర్ష ప్రణాళికలో విద్యుచ్ఛక్తికి హెచ్చు మొత్తాలను కేటాయించడం జరిగింది. కాని మన రాష్ట్రానికి మాత్రం రెండవ పంచవర్ష ప్రణాళికలో చాలా తక్కువ కేటాయించబడింది. ఇండియా ప్రభుత్వము రాష్ట్రాలకు ఈ electricity కి గాను కేటాయించే విధానము చూచినపుడు, అనేక రాష్ట్రాలకంటె మన రాష్ట్రానికి తక్కువగా కేటాయిస్తున్నారని స్పష్టంగా తెలుస్తున్నది. ఇంతకుముందు రాజగోపాల నాయుడుగారు మాట్లాడుతూ మద్రాసు రాష్ట్రంకంటె మనకు తక్కువ ఇచ్చినారని చెప్పారు. మద్రాసు ఒక్కటేకాదు. ఇంకా కొన్ని ఇతర రాష్ట్రాలుకూడ చూడండి. బీహారుకు 27 కోట్లు కేటాయించారు. బొంబాయికి 41 కోట్లు ఇచ్చారు. అంటే ఇది రాష్ట్ర విభజన కాకపూర్వము ఇచ్చినటువంటిది. ఇప్పుడైతే, ఈ మొత్తం ఇంకా పెరిగే అవకాశం ఉన్నది. అదేవిధంగా ఒరిస్సాకు 25½ కోట్లు రూపాయలు. ఉత్తర్ ప్రదేశ్‌కు 54½ కోట్లకు పైగా కేటాయించారు. అందువల్ల మొత్తంమీద ఈ విద్యుచ్ఛక్తి కేటాయింపులో మన రాష్ట్రానికి చాలా తక్కువగా ఇవ్వడం జరిగిందని ఈ విషయములో మనకు న్యాయం జరగలేదేమోనని అనుకోవలసి యుంటుంది. అంతేకాదు, కేంద్రప్రభుత్వము భారీ పరిశ్రమలకుగాను కేటాయించే మొత్తములు చూచుకొన్నప్పటికి కూడాను, మనకు రావలసినటువంటి మొత్తాలు రాలేదు. ఈ electricity విషయంలో మనకు రావలసినటువంటి మొత్తం రాలేదని వేరే చెప్పనవసరం లేదు. ఈ విషయం మన రాష్ట్రప్రభుత్వంకూడా గుర్తించిందని అనుకొంటాను. ఈ rural electrification విషయంలో మనకు చాలా తక్కువ అవుతున్నది. ఇక రాబోయే మూడు సంవత్సరములలో ఒక కాని కూడా మిగలదని చెప్పినపుడు ఈ plan చాలా unbalanced గా అయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. దీని విషయమై మనం కేవలం మన Parliament సభ్యుల ద్వారా పోరాడడమే కాకుండా, ఇక్కడ కూడా మన ప్రభు

త్వము కలుగజేసికొని ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం తప్పకుండా మనకు సహాయం చేయవలసిన అవసరమున్నదని అలాంటి తీర్మానాన్ని ఒకదానిని ఈ అసెంబ్లీలో పెట్టి, దానిని వారికి పంపించి గట్టి ప్రయత్నం చేస్తేనేతప్ప లేకపోతే rural electrification అనేది కేవలం మాటలలోనే ఉండిపోతుంది. మన plan సంపూర్ణంగా నెరవేరాలన్నపుడు, rural electrification కు కావలసిన మొత్తం కావాలన్నప్పుడు కేంద్ర ప్రభుత్వం తప్పకుండా మన సీలింగు 21 నుంచి 26 వరకుగాని 30 వరకుగాని పెంచితేనే తప్ప సాధ్యంకాదు. కనుక దానికి గాను మన ప్రభుత్వము తప్పకుండా కృషి చేయవలసిన అవసరమున్నది. యీ విషయాన్ని మన అసెంబ్లీ మొత్తం ఏకగ్రీవంగా బలపరచడానికి తయారుగా ఉంది. ఆ రకంగా మన ప్రభుత్వము ముందుకు రావాలని మనవి చేస్తున్నాను.

ఇకపోతే రెండవ పంచవర్ష ప్రణాళిక విషయం గురించిగాని, లేకపోతే మనం డబ్బు ఖర్చుపెట్టే విషయం గురించిగాని చాలామంది సభ్యులు చెప్పారు. నిజమే. గత 3, 4 సంవత్సరములలో మన ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము కొంత అభివృద్ధి సాధించింది. కాని కేవలం దాన్నిగురించి సంతోషపడడమే కాకుండా మనం ఖర్చుపెట్టినటువంటి మొత్తాలు ఏ రకంగా ఖర్చుపెట్టినాము అనేది ఆలోచించవలసిన అవసరమున్నదని కూడా చాలామంది సభ్యులు తెలియజేశారు. ఇంతకుముందు శ్రీ రామమూర్తిగారున్నూ, శ్రీ A. C. సుబ్బారెడ్డిగారున్నూ మాట్లాడుతూ అనేక విషయాలు మన House కూడా చాలా serious గా ఆలోచించవలసిన విషయాలు మనముందు పెట్టారు. అయితే ఇప్పుడు సభ్యులు చెప్పిన అనేక విషయాల దృష్ట్యా 1957 సంవత్సరంలో మన Accounts Committee ఇచ్చిన report గనుక చూచినట్లయితే, ఇంకా మన ప్రభుత్వము చాలా serious గా ఆలోచించవలసిన అవసరం వస్తుందని మనవి చేస్తున్నాను. ముఖ్యంగా ఈ Accounts Committee వారు ఈ Electricity Department మీద విచారణ జరిపినప్పుడు అనేక ప్రశ్నలు వేశారు. ఈ Accounts లో సుమారు 20 లక్షల రూపాయలు difference వచ్చింది. అది ఏ రకంగా వచ్చిందంటే కేవలం valuation మీదనే difference వచ్చిందని చెప్పడం జరిగింది. తరువాత దానిని narrow down చేసి ఎనిమిది లక్షలు difference అని ఇక్కడ చెప్తున్నారు. దీనికి చీఫ్ యింజనీరు ఇచ్చిన సమాధానంతో Accouts committee వారు, including Accountant general ఏ మాత్రం convince కాలేదని వారి రిపోర్టువల్ల మనకు అర్థమవుతుంది. దీనికి బాధ్యులు ఎవరు? Who is responsible, store-keeper బాధ్యుడా? లేక Executive Engineer బాధ్యుడా? లేక Chief Engineer బాధ్యుడా? అన్న విషయము అటుంచి, ప్రభుత్వము తన బాధ్యతను ఏ విధంగా చూస్తున్నది అనేది ముఖ్యంగా ఆలోచించవలసి యున్నది. ఇలాంటి report వచ్చిన తరువాత ప్రభుత్వము భవిష్యత్తులో

stores ను maintain చేసే విషయంలోగాని, లెక్కలలో తేడాలు రాకుండా సరియైన పద్ధతిలో ఉంచడానికిగాని మన ప్రభుత్వము మన మంత్రివర్గము తీసుకున్న చర్య ఏమిటి అనేది తప్పకుండా మన అసెంబ్లీకి చెప్పవలసిన అవసరమున్నది. దీని విషయం చాలా జాగ్రత్తగా మన ప్రభుత్వం ఆలోచించవలసిన అవసరమున్నది. ఈ విషయంలో ముఖ్యంగా Accounts committee అధ్యక్షులతో సహా అనేక remarks pass చేసినటువంటి report మనముందర ఉన్నది. ఈ విషయమై భవిష్యత్తులో మన ప్రభుత్వము ఏమి చర్యలు తీసుకొనబోతుంది, ఏ రకంగా దీనిని జాగ్రత్తగా control చేయబోతున్నది. ఈ విషయము గురించి ముఖ్యంగా మన సభ్యులందరు ఇచ్చినటువంటి అనేకమైనటువంటి facts ను దృష్టిలో పెట్టుకొని మనము చాలా జాగ్రత్తగా ఆలోచించవలసిన అవసరమున్నదని మనవి చేస్తున్నాను.

ఇకపోతే మన Electricity Department లో మనం చాలా మొత్తం ఖర్చుపెడుతున్నాము. ఈ మొత్తం ఖర్చుపెట్టేటప్పుడు మన appropriation కంటెకూడా చాలా పెద్దమొత్తాలు కేవలం ఒక్క చీఫ్ ఇంజనీరు తన responsibility మీదనే ఖర్చుపెడుతున్నాడు అనే విషయం కూడా మన Accounts Committee బయటికి తీసుకొని వచ్చింది. ఈ విషయం గనుక చూచినట్లయితే మనకు final grant 8 లక్షల 66 వేలు ఉంటే, 28 లక్షల 50 వేలు ఖర్చుపెట్టబడింది. అంటే 19 లక్షల, 84 వేలు అధికంగా ఖర్చుపెట్టబడిందన్నమాట. మన అసెంబ్లీ pass చేసినదానికంటె సుమారు రెండురెట్లు Chief Engineer తన persanal responsibility మీద ఖర్చుపెట్టారన్నమాట. తొందరగా పనులు చేయడం సంతోషించదగిన విషయమే. కాని ప్రభుత్వము యొక్క permission గాని ప్రభుత్వమును consult చేయడంగాని ఏదిలేకుండా పెద్దపెద్ద పనులు తన స్వంత బాధ్యతపైన నిర్వర్తించడానికి పూనుకోవడం అనేది ఏమాత్రం సరియైన పద్ధతి అనిపించుకోదు. భవిష్యత్తులో ఈ విషయమై మనం గట్టి చర్యలు తీసుకోవలసిన అవసరమున్నది. Accountant general గారు దీని విషయమై గట్టిగా వ్రాశారు. ముఖ్యంగా ఈ Electricity Department లో కోటానకోట్ల వరకు ప్రజలడబ్బు మనము ఖర్చుపెట్టేటపుడు, మనము చాలా జాగ్రత్తగా ఖర్చుపెట్టవలసిన అవసరమున్నది. ఈ విషయంలో Chief Engineer ఇచ్చిన సమాధానము ఏమాత్రము satisfactory గా లేదని తెలియజేస్తున్నాను. పెద్ద మొత్తాలు ఖర్చుపెట్టేటపుడు ప్రభుత్వము చాలా జాగ్రత్త తీసుకోవలసిన అవసరమున్నది. ఆరకంగా తీసుకొన్నపుడే మన Electricity Department effective గా పనిచేయడానికి, ఇంకా జాస్తి స్కీములు మనముందు తీసుకురావటానికి అవకాశం ఉంటుందని నేను మనవిచేస్తున్నాను.

తరువాత ఈ Electricity Department లో ఒక plan అంటూ లేదు. మనము ఒక plan లోపనిచేస్తున్నామని అనుకొంటున్నాము. కాని actual గా చూచినట్లైతే, plan లేకుండానే పనులు జరుగుతున్నట్లుగా ఉంటుందని అనేక

మంది గౌరవ సభ్యులు ఇక్కడ చాలా ఉదాహరణలు చెప్పారు. ఈవేళ నెల్లూరులో ఒక construction కొరకు సామాను తీసిపెట్టిఉంటే, తరువాత చిత్తూరుజిల్లాలోనో లేక ఈ హైదరాబాద్ జిల్లాలోనో construction ప్రారంభించి, అక్కడ ఉంచిన సామాను మళ్లీ ఇక్కడికి తీసుకొని వస్తూఉంటారు. ఈ విధంగా ఎప్పటికపుడు అనేక మార్పులు జరుగుతు ఉండడంవల్ల ఎంతోwastage అవుతుందని, మనపనులు కూడా ఎంతో కుంటుపడుతున్నాయని మనము బాగా తెలుసుకోవచ్చు.

అదేరకంగా ప్రథమ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేటప్పటికి, సుమారు 62,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి మనకు ఉన్నది. కాని 38,000 కిలోవాట్లు మాత్రమే ఖర్చుచేస్తున్నాము. ఎందువల్ల? దానికి కావలసిన ఏర్పాట్లు ఎప్పుడైతే లేకపోయినాయో తప్పనిసరిగా అది నిలబడిపోతుంది. ఇది చాలా waste గా కనబడుతుంది. ప్రణాళిక అమలుజరిపేటప్పుడు, సక్రమంగా ఎంత produce అవుతుందోచూచి, సరైన ఉపయోగంలోకి తెచ్చుటకు పూర్తిగా ప్రయత్నం చేయాలి. నెల్లూరులో థర్మల్ స్టేషన్ ఉన్నది. నాకు తెలిసినంత వరకు 50% capacity కూడా produce చేయుటలేదు. అది ఉపయోగం లేకుండా పోతోంది. 50% మాత్రమే ఉపయోగంలోకి తెస్తున్నారంటే, స్కీము అమలులో పెట్టేటప్పుడు ఒక నిర్దుష్టమైన విధానంలేదని బోధపడుతుంది. మాచ్ ఖండ్ లో పనిపూర్తికాగానే సీలేరు ప్రారంభిస్తామని అన్నారు. అది ప్రారంభించినట్లయితే initial expenses కొన్ని లక్షల రూపాయలు save చేసుకొనుటకు వీలుంటుంది.

Lines వేసేటప్పుడు చాలా మొఖమాటాలు, పక్షపాతాలు ఉన్నవని చెప్పుటకు విచారిస్తున్నాను. ఒక ప్రాంతంలో ప్రారంభిస్తామని పుస్తకాలలో ఉంటుంది. పేపర్లలో ప్రకటించినదాంట్లో మరోప్రాంతంఅని ఉంటుంది. చివరకు, లైనుఇంకో ప్రాంతంలో వేస్తారు. ఈ డిపార్టుమెంటుశక్తిగలది explanation యివ్వగలరు. అక్కడ వేయవలసినది sanction కాలేదని చెప్పగలరు. అక్కడ material waste కాకుండ, యింకొక చోటకు తీసుకువెళ్ళామని చెప్పగలరు. అందువల్ల ప్రభుత్వం పక్షపాతములులేకుండా, ఎక్కడైతే లైను వేయదలచుకున్నారో, అక్కడనే నిర్మించుకొనుటకు పూనుకొనవలెనుగాని, వేస్తామన్నచోట వేయకుండా, సామాను మార్చినందువలన బాడుగులు నష్టము అవుతుందని, యిదిసరిదిద్దు కొనవలెనని మనవిచేస్తున్నాను.

Electricity extention scheme అమలు జరిపేటప్పుడు కేవలం లాభాలు రావాలనేదృష్టితో అభివృద్ధిఅయిన ప్రాంతాలలోనేపెట్టుతున్నారు. కొన్నిచోట్ల కేవలం lights కోసం, సినిమాలకోసం యివ్వడంవల్ల remunerative గా లేదనే దృష్టితో పరిశీలించుట జరుగుతోంది. కాని Electricity scheme ప్రారంభించ

గానే, వ్యవసాయానికి కూడ యివ్వటానికి పథకాలు వేసి అమలుజరిపితే remunerative గా ఉంటుంది. దానివలన వ్యవసాయాభివృద్ధికి దోహదం కలుగుటయే గాక ఆ ప్రాంతంలోని ప్రజలను ఉత్సాహపరచిన వారగుతారని మనవి చేస్తున్నాను.

ఈ extension స్కీములో కొన్ని difficulties కూడా ఉన్నాయి. కనిగిరిలో electricity యిచ్చారు. నేను Chief Engineer, యితర ఇంజనీర్లకు వ్రాశాను. వ్యవసాయానికి 2, 3 బావులకు యివ్వమంటే అవకాశంలేదన్నారు. మాచ్ ఖండ్ నుంచి కరెంట్ వస్తున్నప్పుడు వ్యవసాయానికికూడా యిస్తే చాలా ఉపయోగంగా వుంటుంది. వ్యవసాయానికి విద్యుచ్ఛక్తికి మినిమమ్ డిపాజిట్ రు. 75లు ప్రభుత్వానికి కట్టాలి. ప్రతి horse power కు రు. 15ల చొ. కట్టాలి. ఇదిగాక pump sets తెచ్చుకొనుటకు చాలా expense అవుతున్నది. కాబట్టి యీ డిపాజిట్ మొత్తం కొంతవరకైనా తగ్గించుటకు ఆలోచించాలి. వ్యవసాయానికి యిచ్చే కరెంటుకు 0-0-9 నుంచి యిప్పుడు 0-1-6 కు పెంచారు. ఆ విషయం కూడా ఆలోచించాలని మనవిచేస్తున్నాను.

పబ్లిక్ సంస్థలకు కూడ - P.W.D ఆఫీసుకు గాని, ఆసుపత్రికి గాని - కరెంట్ కావాలంటే ఒకసంవత్సరం కాగితం నడవాలి. వెంటనే pass కాదు. ఆవిధంగా red-tapism లేకుండా, coordination తో ఒక plan ప్రకారం పనిచేయాలి.

ఇంతకు ముందు శ్రీరామమూర్తిగారు మనవిచేశారు. ఈ Electricity ప్రభుత్వపరిశ్రమగా ఉన్నది. అందువల్ల దీనిలోని వర్కర్సు విషయంలో ప్రైవేటు పెట్టుబడిదార్లకు ఆదర్శప్రాయంగా వుండాలని ప్రత్యేకంగా నొక్కిచెప్ప నక్కర లేదు. పెద్ద ఉద్యోగస్థులకు ఎంత ఖర్చో, క్రిందివారికి ఎంత ఖర్చో లెఖ్కలు చెప్పారు. పెద్ద పెద్ద ఉద్యోగస్థులు administration చేసేవారు, వర్కర్ల వ్యవహారం వచ్చేటప్పటికి పొదుపుచేయాలనో, ఏమో, వారి కష్టాలు గుర్తించకుండా చాలా నిర్దాక్షిణ్యంగా వుంటున్నారని ప్రభుత్వ దృష్టికి తేవటానికి విచారిస్తున్నాను. మంత్రిగారికి కూడ represent చేశారు. వారికి ఈవిషయాలన్నీ తెలుసు కాబట్టి serious గా ఆలోచించాలి. జూలై, ఫిబ్రవరి 57 లో షుమారు 800 మంది వర్కర్లను రిట్రెంచ్ చేశారు. G. O. 3347 ప్రకారం వాళ్లకు రావలసిన remuneration రాలేదు. గారేజి వర్కుషాపులో over work రాత్రింబవళ్ళు ఆదివారాలు పనిచేశారు. over work కు payment, G. O. 7030 ప్రకారం యింతవరకు యివ్వలేదు. agency ప్రాంతాలలో పనిచేసేవారికి special pay యివ్వాలనీ G. O. పాస్‌చేశారు. యింతవరకు ఏమీయివ్వలేదు. ఇవి గాక "go home" concessions ఉన్నాయి. Government G. O. ల ప్రకారం

ఒక్కటీ యింతవరకు యివ్వలేదు. ప్రభుత్వ పరిశ్రమలలో నేవీటిని అమలుపరచక పోవటం ఏమి న్యాయమో ప్రభుత్వం ఆలోచించాలి.

Electricity Board విషయం, Advisory Council విషయం మంత్రిగారు సెలవిచ్చారు. ఈ Board కేంద్రప్రభుత్వం వేయటంవల్ల మనకొంపకు తిప్పలు వస్తాయి. సంజీవరెడ్డిగారు యిది feasible గా లేదని చెప్పారు. మన ప్రభుత్వం ఈ విషయంలో స్పష్టమైన వైఖరిని ప్రదర్శించాల్సిన అవసరం వున్నది. మన ప్రభుత్వం చేయాలిగాని, సెంట్రల్ గవర్నమెంటు క్రింద ఒక బోర్డుపెట్టి I. C. S. ఉద్యోగులను వేసి, ప్రజాభిప్రాయానికి కూడ అవకాశంలేకుండా చేసేపద్ధతి తీసుకురావద్దు.

Advisory council విషయంలో శాసనసభ్యుల పేర్లుకూడ లేవు. కేవలం advisory body గా కాకుండా, కొంత value ఉండే బాడీగా తయారుచేసి, శాసన సభనుంచి కూడ సభ్యులను తీసుకొని function చేయించాలి.

కార్మికుల విషయంలో చాలామంది చెప్పారు. ప్రభుత్వం materials అన్నీ సప్లయిచేస్తుంది.—Wires, Poles, Cement యిస్తారు; యిక కంట్రాక్టర్సు గులక రాయి, గడ్డపార ఉపయోగిస్తారు. మాచ్ ఖండ్ లో డిపార్టుమెంటు ద్వారా workers effectiveగా పనిచేస్తారని రుజువు చేయబడింది. పగానన్ డంకర్లీ కంపెనీకో కంట్రాక్టుయిచ్చి చేయించుటవల్ల నిర్దాక్షిణ్యంగా వర్కర్లనురిట్రెంచిచేస్తున్నారు. 10, 20 సంవత్సరాలు వర్కర్సును అడవులలో ఉంచి పెద్ద పెద్ద ప్రాజెక్టు నిర్మించి, చివరకు వారిని నిర్దాక్షిణ్యంగా retrench చేస్తున్నారు. ఈ పరిస్థితిని మంత్రిగారు పరిశీలించి, డిపార్టుమెంటు కాగితాలు చూడటమే కాకుండా మన కున్న అనుభవాన్ని బట్టి పూర్తిగా విచారించి, తగిన న్యాయం కలుగజేయాలని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

*శ్రీ జె. వి. నరసింగరావు : అధ్యక్షా ! సభ్యులు చాలామంచి సూచనలు యిచ్చారు. Electricity గ్రామగ్రామానికి రావాలి, యింటింటా వెలుతురు రావాలి అనేదానిలో భేదాభిప్రాయంలేదు. ఇతర ప్రాంతాలతో పోల్చిచూచిన, యీవిషయంలో మనము వెనకపడియున్నాము. ఏరీతిగానైనా మన తలసరి consumption, improve చేయవలెననే విషయం ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఏతీరుగానైన ఎక్కువ డబ్బువచ్చే ప్రయత్నాలు చేస్తున్నాము. ఈ ప్రయత్నాల కొరకు నేను ఢిల్లీ వెళ్లాను. ముఖ్యమంత్రిగారుకూడ ఢిల్లీ వెళ్లారు. అక్కడ అందరినీ కలుసు కున్నాము. ప్రత్యేకంగా ఇరిగేషన్, పవర్ డిప్యూటీ మంత్రిగారిని ఆహ్వానించి, ఆఫీసర్లను పిలిచి యిక్కడి పరిస్థితులన్నీ చెప్పాము. ఆంధ్ర ప్రాంతంలో రు. 4 కోట్ల డబ్బు యితరపనులపైన ఉపయోగించవలసివచ్చినది. నేను యిక్కడ

మనవిచేసినట్లు, యిది ఒక commercial unit గా సక్రమంగా పనిచేయాలంటే ఆదాయముకూడ చూడవలసియుంటుంది. దానినిబట్టి గర్విడి ఫాక్టరీ, యితర కంపెనీలకుయివ్వడం అత్యవసరమైనది. దానివల్ల కొంత (foreign exchange) విదేశీ మారకం దొరుకుతుంది. ఆ ఆదాయంవల్ల commercial concern గా స్వయంపోషకంగా వుండటానికి అవకాశం ఉంటుంది. గరివిడి మొదలగువానిలో దానినిబట్టి 2 కోట్లవరకే ఉండిపోయాయి, ఈ సంవత్సరం సరిపోతాయి. ఇంకా 3 సం॥లు యీతీరుగా గడవాలి.

ఆంధ్ర ప్రాంతంలో ప్రతివారికి electricity consciousness బాగా వచ్చింది. తెలంగాణాలో అంత ఆతీరుగా demand లేదు. శాసనసభలో యివాళ చెప్పాలని చెప్పారు గాని నన్నుకలుసుకొని (ఒకరిద్దరు తప్ప) కావాలని కోరిన వారు లేరు. ఆంధ్రలో ఎక్కువగా కోరుతున్నారు, వ్యవసాయానికి కావలెనని, cottage industries కు కావలెనని, యీతీరుగా అప్లికేషన్సు తెస్తున్నారు. శాసనసభ్యులు అడుగుతున్నారు. శ్రీ ఎస్. కె. పాటిల్ గారు మొన్న నాగార్జున సాగర్ వచ్చినప్పుడు మన పరిస్థితినంతా విపులంగా చర్చించాను. ఒకపెద్దనోటు తయారుచేసి వారికిచ్చాము. 'కావాలంటే ముందు ఏతీరుగా అయినా ఎడ్జస్ట్ చేసుకోవచ్చు ; కాని మాకుమాత్రం లోన్‌రూపంగాగాని, ఏరూపంగానైనా సరే డబ్బుకావాలి ; కొంతఇప్పించి తీరాలి ;' అంటే వారు ప్రయత్నిస్తామన్నారు. వారు ఇక్కడే వెంటనేఇచ్చే అవకాశం లేదుగదా. వారుపోయి ప్రయత్నంచేస్తామన్నారు. కొందరు సభ్యులు విద్యుచ్ఛక్తికి డబ్బు కేటాయింపు చాలాతక్కువ ఉన్నదని అన్నారు. అది పొరపాటు. ఇరిగేషన్ ఎలక్ట్రిసిటీకి కలిపి ఒకే కేటాయింపు ఉంటుంది. మనము ఒక పెద్ద ప్రాజెక్టు, ప్రపంచములోకల్లా పెద్దప్రాజెక్టు నాగార్జున సాగర్ నిర్మించేటప్పుడు, దానికి ఎక్కువ డబ్బు ఖర్చుచేయవలసి ఉంటుంది. మద్రాసులో ఇరిగేషన్ ప్రాజెక్టులులేవు. వారు డబ్బంతా పవర్ మీద ఖర్చుచేస్తున్నారు. ఈ విషయాలన్నీ సభ్యులు విశాల దృష్టితో చూసి, ఆలోచించి మాట్లాడవలసిఉంటుంది. ఎంత వీలైతే అంత గ్రామాల కొరకు విద్యుచ్ఛక్తిపై డబ్బు వెచ్చించటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తున్నది. గ్రామాలలో సదుపాయాలు కల్పించటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తోంది. ఎన్నో కష్టాలు ఉన్నప్పటికీ, యీ సంవత్సరంకూడ, తెలంగాణాప్రాంతంలో రూరల్ ఎలక్ట్రిఫికేషన్ క్రింద 78 లక్షల రూపాయలు వెచ్చించాలని అనుకొన్నాము. 78 లక్షల రూపాయలు అంటే అది సామాన్యవిషయముకాదు. డబ్బు ఉన్నది. కాని, పని పూర్తికావాలంటే, మనకు సర్క్యూట్‌బ్రేకర్స్ కావాలి. ట్రాన్స్‌ఫార్మర్స్ కావాలి. ఇంకా ఎన్నో అవసరమైన వస్తువులు కావాలి. కొన్ని వస్తువులు మనదేశంలోనే తయారవుతున్నవి, కాని మనం కొన్ని వస్తువులకు విదేశాలమీద ఆధారపడవలసిఉన్నది. ఇదివరకే ఎన్నో ఆర్డర్సు ఉన్నాయి, కాని

ఫారెన్ ఎక్స్చేంజ్ లేదు. ఫారెన్ ఎక్స్చేంజ్ మొదలే ఎందుకు ఆలోచించుకోలేదని మీరు అనవచ్చును. కాని సూయజ్ కెనాల్ వ్యవహారాలు, మొదలైన వాటివల్ల ఫారెన్ ఎక్స్చేంజ్‌లో మనకు ఏదైతే లోటు ఏర్పడిందో, అది సభ్యులకు తెలియందికాదు. కాబట్టి, ఇప్పుడు మనకు కొంత ఫారెన్ ఎక్స్చేంజ్ కావాలని ప్రయత్నము చేస్తున్నాము. నిన్న టి. టి. కృష్ణమాచారిగారు వచ్చినపుడు, నేను ఒక నోట్ వ్రాసి, ముఖ్యమంత్రిద్వారా వారికి అందజేశాను. వారుకూడా ప్రయత్నంచేస్తామన్నారు.

తెలంగాణాలో ముఖ్యంగా రామగుండం థర్మల్ స్టేషన్‌కు నూటికి తొంభయిపాళ్ళు పని పూర్తయింది. కాని, కొన్ని ట్రాన్స్‌ఫార్మర్స్ వాటికి సంబంధించిన పరికరాలులేక ఇంకా మనం పూర్తి వినియోగం చేయజాలకున్నాము. ఏస్కీములు పూర్తికానున్నవో, ఆ స్కీములకు ప్రెయారిటీ ఇస్తామన్నారు. బహుశా 30 లక్షలదాకా ఫారెన్ ఎక్స్చేంజ్ లభించగలదని ఆశిస్తున్నాము. ఆంధ్రప్రాంతంలో గరివిడికి ఫారెన్ ఎక్స్చేంజి, మనం ఏదైతేఇస్తున్నామో, దానిని సక్రమంగా వినియోగించాలంటే, మనకు హీనం 50 లక్షలైనాకావాలి. చీఫ్ ఇంజనీర్ ఢిల్లీకి పోయి అక్కడివారందరిని కలిశారు. ప్లానింగ్‌కమీషన్ వారు కూడ ఒప్పుకొన్నారు. కాని ఫైనాన్స్ డిపార్టుమెంటులో కొంత పేచీ వచ్చిందని తెలిసి, దానికొరకు నిన్నవచ్చిన మంత్రిగారితో వేడుకొన్నాము. అందుకు సాధ్యమైన ప్రయత్నములు జరుగుతున్నవి.

గ్రామాలకు విద్యుచ్ఛక్తి పోవాలంటే, ఏ విధంగా చౌకగా పోవాలనే ఆలోచనకూడ జరిపాము. సాధ్యమైనంతవరకు కర్ర స్తంభాలు వాడాలని అనుకున్నాము. కర్ర స్తంభాలు వాడటానికి ఇక్కడ ఆచారం లేదుగనుక ఫారెస్టువారిని అడిగితే సరిఅయిన స్తంభాలు దొరకవని చెప్పారు. కాని దానికి సంబంధించిన మంత్రిగారు చాలా ఉత్సాహంగావారి ఉద్యోగులను పిలిచి, నేనుకూడా చీఫ్ ఇంజనీర్‌ను పిలిచి ఇంత పొడుగు స్తంభాలే కావాలనికాదు; రెండు భాగాలుగా ఉన్నా, జాయింట్‌చేసి వాడవచ్చును" అని చెప్పాము. మనకు కావలసినది విద్యుచ్ఛక్తి. అంతేగాని స్తంభము గుండ్రగా చక్కగా ఉన్నదా లేదా అని కాదు. కర్ర స్తంభాలు వాడితే మంచిదని అనుకొన్నాము. ఈ విషయాలన్నీ మూడు దినాల క్రిందటనే నిర్ణయం చేసుకొన్నాము; మాకు కావలసిన స్థంభాలు దొరుకుతాయేమో, చూడవలసినదిగ, చీఫ్ ఇంజనీర్, ఫారెస్టు చీఫ్ కన్సర్వేటర్‌లకు చెప్పినాము. కర్ర స్తంభాలు ఉపయోగించటమువల్ల ఖర్చు తగ్గుతుంది. మొదలు అప్పుగా డబ్బు సేకరించే ఒక స్కీము ఉండెను. తరువాత యీ స్కీము సరిపోదని తీసివేశారు. ఈ

విషయం ఫైనాన్స్‌వారితో మళ్ళీ ఆలోచించి, కనీసం 6,7 సంవత్సరాలకు అప్పు చౌకవడ్డీతో తీసుకోగలుగుతామా, దాంతో ఏదైనా లాభం చేయగలుగుతామా, అన్నది ఆలోచిస్తున్నాము. తెలంగాణా ప్రాంతంలో లేవుగాని, ఆంధ్ర ప్రాంతంలో కొన్ని డబ్బుగల పంచాయితీలు ఉన్నాయట. వారు స్వంత డబ్బు వెచ్చించి లైన్సును వారి హద్దులలో వేయించటానికి సిద్ధంగా ఉంటే మేము కనక్షన్ ఇవ్వటానికి ఎంతవరకు సాధ్యమవుతుందో ఆలోచిస్తున్నాము. ఇవన్నీ కూడ ప్రస్తుతము ఆలోచనలోనే ఉన్నవి. అవి కార్యరూపము దాల్చాలంటే కొంత కాలము అవసరము. కర్ర స్థంభాలు వాడటం ఇతర ప్రాంతాల్లో అమల్లోలేని విషయం గనుక, తీరిగ్గా మనం ఆలోచించుకొని ఒక అడుగు ముందుకు వేయాలి. మనము నెమ్మదిగా ఒక అడుగు ముందుకు వేయటానికి ప్రయత్నించాలి: తొందరగా తొందరగా ఒక అడుగు ముందుకువేసి రెండు అడుగులు వెనక్కు వేసేటట్లుగా మనం ఆలోచించకూడదు. కాబట్టి ప్రతిగ్రామానికి విద్యుచ్ఛక్తి సప్లయిచేయటానికి ప్రయత్నాలు మాత్రం జరుగుతున్నాయి. తప్పకుండా గ్రామాలలో విద్యుచ్ఛక్తి అవసరమే. విద్యుచ్ఛక్తి కుటీరపరిశ్రమలకు అవసరము, వ్యవసాయమునకు అవసరము. దీని విషయంలో ఎవరికి అభిప్రాయభేదములేదు. ఇప్పుడున్న పరిస్థితుల్లో ఏమిచేయాలి, ఏ విధంగా ముందుకు పోవాలి అన్న ఆలోచన ఉన్నది. ఏదో ఉపన్యాసం చెప్పాలని, యీ కట్ మోషన్స్‌మీద మాట్లాడాలని, ఊరికే ఏవో విషయాలు ఇక్కడ చెప్పటం బాగాలేదు. సభ్యులకు ఆచరణయోగ్యమైన ఆలోచనలు వస్తే తప్పకుండా నా దగ్గరకు రావచ్చును. నాకు సభ్యుల సూచనలు ఇవ్వవచ్చును. వాటిని అమలు పర్చటానికి ప్రయత్నిస్తాను. అందరికంటె ఎక్కువబాధ నాకు ఉన్నది. సభ్యులంతా వస్తారు, నన్ను అడుగుతారు, సభ్యులకు చేయజాలకపోతున్నానే అని బాధ ఉన్నది.

ఈ మధ్య ఛీఫ్ ఇంజనీర్‌ని పిలిచి వారితో ఆలోచించాను. ఈ డబ్బు ఏదైతే మనం ఖర్చుపెడుతున్నామో, ఆ డబ్బుతో ప్రతి నియోజకవర్గంలోను కొంతకొంత పనిచేస్తే బాగుంటుందని అనుకొంటున్నాను. ఏదో లైను తీసుకొని, పది లక్షలో, ఇరవై లక్షలో ఖర్చుపెట్టాం, అయిపోయింది అని అనకుండా, ప్రతి నియోజకవర్గంలోను కొన్నికొన్ని గ్రామాలను తీసుకొనిపనిచేస్తే బాగుంటుందా, యీ స్కీమును ఎంతవరకు జయప్రదంగా నడపగలుగుతాము, అని ఆలోచిస్తున్నాము. ఇది ఇంకా ఆలోచనలో ఉన్నది. కాబట్టి, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయాలనే సభ్యుల అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. అవసరముంటే, మళ్లీ ఢిల్లీకి పోయి తగినంత కృషిచేసి, యీ విషయంలో సహాయము లభించునటుల చూస్తాను. కొందరు సభ్యులు వేరువేరు విషయాలు చెప్పారు. మనము అందరము ఒక కుటుంబము మోస్తరుగా పనిచేసుకోవలసి ఉన్నది. మౌలానాసాహెబ్‌గారు "మంత్రిగారు యీ 5 సంవత్సరాలలో మంచి పనులు

చేయాలి, అతను చనిపోయిన తర్వాత, ప్రజలు అతడు చాలామంచివాడు అని అనుకొనటానికైనా అతడు చేయాలి" అనే ధోరణిలో చెప్పారు. అది కాదు. వ్యక్తుల కాలం పోయింది. పర్సనాలిటీకల్ట్ ఇప్పుడు కాదు. మనమందరం, శాసనసభ్యులుగా, ప్రజాప్రతినిధులుగా యీ శాసనసభాకాలంలో ఇంతపని చేయ గలిగామని చెప్పుకోవాలి. ఈ విధంగా ఒక సమిష్టికుటుంబము మాదిరిగా చేస్తే, అప్పుడే మనమందరము దేశానికి సేవ చేయగలిగిన వారమవుతాము. అప్పుడే మన బాధ్యత నెరవేర్చుకొన్నట్లు అవుతుంది. ఊరికే ఏదో కాఫీహోటల్స్‌లో వలె, ఎవరో మాట్లాడారు, ఏదో విన్నాము అన్నట్లుగా ఉండకూడదు. ఈ చిలంగజట్ వార్తలపై, బాధ్యతగల వ్యక్తులు యీ శాసనసభలో ఉపన్యాసం ఇస్తే, అవి విని పత్రికావిలేఖరులు పత్రికలలో హెడ్‌లైన్సులో వేసుకొంటారని, గుర్తించి ఏవో విషయాలు చెబుతూంటే, అవి ఎంతవరకు బాగుంటాయో ఆలోచించండి. ఏదో చెప్పారు, కోటి రూపాయలు పోయాయట, ఈ విధంగా ఎన్ని విషయాలైనా చెప్పవచ్చు. ఈ శాసనసభ్యులు ఎవరైనాసరే వస్తే వారితో పన్నెండుగంటలు కూడ కలిసి మాట్లాడటానికి సిద్ధంగా ఉన్నాను. ఇది ఎన్నడో జరిగింది, ఎప్పుడో జరిగింది అని ఊరికే చెప్పటం కాకుండా, 51 లో జరిగిన కేసు ఉన్నదనో, 54 లో జరిగిన కేసు ఉన్నదనో, నిజంగా సభ్యుల మనస్సుకు నొప్పిఉంటే ఆ డబ్బు నిజంగా ఖర్చు యినట్లు సభ్యులకు బాధకలిగితే నా వద్దకు వచ్చి చెప్పండి. కాని ఇవాళే కోటి రూపాయలు ఎక్కడో పోయినట్లు సభ్యులు చెప్పగా నేను విన్నాను. ఇంజనీర్‌ని పిలిచి తెలుసుకొంటే అదంతా బూటకం దానికి ఏమీ ఆధారం లేదని ఆయన అన్నారు. ఏది నిజమో నేను ముందు తెలుసుకోవాల్సిఉన్నది. కాబట్టి, కరతాళధ్వనులకోసం, ప్లాట్‌ఫారం ఉపన్యాసాల ధోరణిలో చెప్పటం కాకుండా, నిజంగా యీ లోపాలను సరిదిద్దాలి, వీటిని బాగుచేయాలి, అన్న ఉద్దేశంతో సూచనలు చేయటానికి ప్రయత్నించాలి. మనం అప్పుడే దేశాన్ని బాగుచేసినవారము అవుతాము. ఇది వ్యక్తుల ప్రభుత్వము కాదు. వ్యక్తి మంచివారు కావచ్చును, చెడువారు కావచ్చును. కాబట్టి, నాకు తెలిసిన విషయాన్ని బట్టి అటువంటిదేమి జరుగలేదు. తరువాత ఇంకొక విషయం చెప్పారు. ఎవరో లక్ష రూపాయల కాపర్ వైర్ అపహరించారని చెప్పారు. దానిని నేను విచారించాను. 30 హండ్రడ్‌వైట్స్ కాపర్ వైర్ మాత్రం అపహరించారు. దానిని గురించి చర్యలు తీసుకోబడుతున్నవి. అతనిని సస్పెండ్ చేశారు. దాని విషయంలో ఇంకా ఏవైనా లోట్లుంటే సభ్యులు నాకు చూపితే బాగుచేస్తాను. ముఖ్యంగా నేను, మొదట, చార్జి తీసుకోగానే, మా డిపార్టుమెంటు వాళ్ళను పిలిచి ఒకటే చెప్పాను. "నేను ఏదైనా టాలరేట్ చేయగలుగుతానుగాని, కరప్షన్ మాత్రం టాలరేట్ చేయజాలనని" చెప్పాను. అందుకోరకు సభ్యులకు ఏమి అనుమానం వచ్చినా, ఏ విషయం గురించైనా నాకు తెల్పండి. సంతకం లేని జాబులు వచ్చినా, వాటిని గురించి పరిశీలించ

టానికి ప్రయత్నం చేస్తున్నాను. ముందుకూడ అదేవిధంగా చేస్తాను. ఎవరో చెప్పారు, "ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు చెడ్డది, పి.డబ్ల్యు.డి. డిపార్టుమెంట్ వేస్టేజ్ డిపార్టుమెంటు" అని. ఈ విధంగా ఏదో చెప్పటం ఒక ఆచారంగా వస్తున్నది. ఆ విధంగా వారు చెబుతూండటము, మనం దానికి ఏదో జవాబు చెప్పటం, అన్న విధంగా మనం పోకూడదు. కాంక్రీట్ ఇన్‌స్టెన్సెస్ చూపండి. అవి సభ్యులు ప్రూవ్ చేయజాలకపోవచ్చు. సభ్యులు సరిగా ప్రూవ్ చేయజాలక పోయినప్పటికీ, నాకు నచ్చజెప్పితే, వారికి డిపార్టుమెంటల్ రూల్సుప్రకారంగా శిక్ష ఇవ్వజాలకపోయినా, ఏవో ఇతర చర్యలు, వారిని ట్రాన్స్‌ఫర్ చేసో, ఏవో చర్యలు తీసుకోటానికి ప్రయత్నం చేస్తాను. ఎన్నో విషయాలు చెప్పారు. ప్రత్యేకంగా ఒక్కొక్క విషయం నేను మనవిచేయాలంటే చేయ గలుగుతాను గాని సమయం కూడా కొంత తక్కువ వుంది. అయినప్పటికీ కూడా...

*Mr. Speaker :* The hon. Minister can take as much time as he likes.

శ్రీ జె. వి. నరసింగరావు : Thank you, Sir. శ్రీ సీతారామమూర్తి గారు మాట్లాడుతూ Rural Electricity scheme ల విషయంలో చెప్పారు. దానిని గురించి యిదివరకు మనవిచేశాను. తరువాత క్రొత్త తమాషా జరిగింది. నెల్లూరులో, మాచ్‌ఖండ్‌లో, మాచెర్లలో generators అన్నీ burn అయి పోయినాయట! అది ఒక తమాషా. నాకు ఆ విషయం ఎవరో చెబితే ఇంత అన్యాయం ఎట్లా జరుగుతుంది, అన్నిచోట్లా ఒకేసారి burn అవడం ఎట్లా జరుగుతుంది? అట్లా కాకూడదని నేను అనుకున్నాను. దానితరువాత యిదిమాత్రం జరిగింది. ఆ లోటు గురించి చెప్పుకోవాలి. మాచర్లలో supply అవసరంవుంటే, నాగార్జునసాగర్ పనులు జరుగడానికి మాచ్‌ఖండ్ లైను పూర్తిగా కాకముందే అక్కడ అవసరంకొరకు కొన్ని పాత sets అయినా మంచిదే, పనిమాత్రం ఆప వద్దనే వుద్దేశ్యంతో యీ sets తెచ్చి పని ఆరంభించారు. అప్పుడు అందులో ఒక set సరిగా పనిచేయక కొన్ని దినాలు light కొంత dim గా వచ్చింది. కావలసినంత సప్లయికానందువల్ల కొంతపనికి లోటయినది. అప్పుడు నాగార్జున కాలేజి సంబంధంగా నేను అక్కడకు పోవడం తటస్థించింది. అప్పుడు నాకు ఆ విషయం తెలుస్తే రాత్రి 11 గంటలకు ferry పంపించి, Engineer ను మాచెర్ల నుంచి రప్పించి చెప్పాను, "రెండు దినాలలో యిది కాకుంటే తగిన కఠినచర్య తీసుకోవలసివస్తుందేమో! మీరు యింతకుముందు ఎందుకు అశ్రద్ధచేశారు?" అని అన్నాను. కాని దానివల్ల public యేమీ ఇబ్బంది పడలేదు. నాగార్జునసాగర్ ప్రాజెక్టువారుకూడా వేరేరూపంగా పని పూర్తిచేసు కున్నారు. నష్టంమాత్రం ఎవరికీ కాలేదు. ఆ పనికూడా పూర్తయినది. ఇప్పుడు

ఆ బాధేలేకుండా మాచ్ ఖండ్ నుంచి వచ్చే direct line connection ఇవ్వబడినది. పాతసెట్లు stand by తీరుగా అక్కడున్నవి. నెల్లూరులో కూడా machines ఉన్నవి. మరమ్మత్తు అప్పుడప్పుడు అవసరమవుతుంది. ఏదయినా అవసరమై repair చేస్తే అది burn అయిపోయింది, భస్మం అయిపోయింది అనే వాదనను తీసుకురావడం మర్యాద కాదు. ఎక్కడైనా మాచ్ ఖండ్ లో కూడా, అంత పెద్ద machines, క్రొత్త machines burn అయిపోవడమనేది ఏమి ఉంటుంది? అసలు burn అనే పదమే తప్పు. మొన్న ఒక ప్రశ్నకు జవాబు చెప్తుతూ యీ సంగతి చెప్పియుంటిని. అక్కడ machinery instal చేసిన తరువాత technicalగా కొంత లోటు కనిపించింది. దాని తరువాత ఒక ఇంజనీరును కలకత్తానుంచి పిలిపించారు. బాగుచేశారు. ఇంకో set బాగవుతుంది. అదే తప్ప burn అవడం అనేది యేమీలేదు. నేను నెల్లూరు వెళ్లినప్పుడు "అప్పుడప్పుడు యిక్కడ light fail కావడం సాధారణం" అని చెప్పారు. అంటే నేను 'ఇది నిజమేనా!' అనుకున్నాను. అప్పుడే Superintending Engineer ను పిలిస్తే వాళ్ళ దగ్గరున్న records ద్వారా ఎప్పుడెప్పుడు fail అయినవో చూపెట్టారు. ఆయన నాకు నచ్చచెప్పగలిగారు. అంటే సామాన్యంగా light పోవాలనేలేదు. ఏదయినా ఒక defect వుంటే stand by arrangement లేకుంటే ఎప్పుడో అవుతూవుంటుంది. అంత మాత్రాన అన్నీ చెడ్డ machine లే అని, సకాలానికి పనికి రావడంలేదనీ లేక attentive గా లేకపోవడం వల్ల యింట్లాంటివవుతాయనే impression తో కూడిన భావాలు మాత్రం సరైనవి కావని నేను మనవి చేస్తున్నాను. తరువాత మాచ్ ఖండ్ పనివారి విషయం వారు చెప్పారు. అక్కడ జాలాపుట్ డామ్ పని పూర్తయినది. పని పూర్తయినా కూడా ఏదో case pending గా వుంది కనుక ఆపనివారిని అట్లనేవుంచాలని శాసనసభవారంతా తీర్మానిస్తే నాకేమీ బాధ లేదు. పనిలేకపోతేకూడా జీతాలుయివ్వండి అంటే ఆ వున్నడబ్బుకూడా వృథా అయిపోతే Rural Electrification కు డబ్బుకూడ లేని పరిస్థితి వస్తుందేమో ? అందుకే దానినిగురించి Labour Department కు సంబంధించిన వాళ్ళను నిపుణులైన వారందరినీ, Advocate General ను విచారించి "ఏమండీ pending case కు దీనికి యేమీ సంబంధం లేదుకదా" అని విచారించాను. పని పూర్తయినదని మనం ఒక నిర్ణయానికి వచ్చిన తరువాతనే యీ నెల 15 వ తేదీనాడు ఆపని ఆపివేయబడ్డది. ఇంకా మనకు ఎంత డబ్బవుతుందో, ఎంత చేయగలుగుతామో, అంత పని పూర్తయిపోతుంది. కనుక యిప్పుడు వారి అవసరంలేదు. అవసరంలేనప్పుడు ఏమి చేయాలి, retrench చేయడం తప్ప ? Act ప్రకారంగా రూల్సు ప్రకారంగా ఒక నెల జీత భత్యాలు, యింకా యేమేమి యివ్వాలో అవన్నీ వారికి అందజేశాము. శాసన సభ్యులను తీసుకుని యూనియన్ వారు యిక్కడికి వస్తే నేను వారితో విచారించాను. దాని తరువాత నేనుకూడా వారి కేదైనా ఉద్యోగం కావాలి. ఏ రీతిగా చేయాలి అనుకుని

మళ్ళీ అక్కడ యింకేదో పనివుంటే వేరేచోట్ల అక్కడనే వారితో పని తీసుకో గలిగితే ఏదయినా చేయాలనే వుద్దేశ్యంతో మళ్ళీ Lobour Commissioner ను, Chief Engineer ను పిలిచి వారితో ఆలోచించాను. అక్కడ కొద్ది పని మాత్రమే వుంది. ఆపనికూడా కంట్రాక్టర్లకు యిచ్చారు. బాధ్యతగా వచ్చే machinery ని భద్రంగా తీసుకుపోయి అక్కడ పెట్టేపని. దానిని మనం departmental గా చేస్తే "అది విరిగిపోయింది, యిది పగిలిపోయింద" ని చెబితే తరువాత బాధ్యత మనపై వుంటుంది. కాంట్రాక్టరుకు యిస్తే వానిపైన బాధ్యత వుంటుంది. కనుక కొన్ని పనులుమాత్రం contractors కు యిచ్చారు. 'నాగార్జున సాగర్ ప్రాజెక్టు క్రింద వీలయినంత వరకు మీకు అవకాశం కలుగ జేస్తాం. Skilled workers యింతమంది, unskilled workers యింతమంది, అని ఒక list నాకు తీసుకువచ్చి యివ్వండి, ఆ ప్రయత్నం నేను తప్పకుండా చేస్తాను' అని చెప్పాను. ఇంకో అవకాశంవుంది. భారతసేవక సమాజంవారు కొన్ని లక్షలు ఖర్చుచేసే ఒక కార్యం తలపెట్టారు. ప్రభుత్వంకూడా దానికి సహకరించి లక్ష రూపాయలు పెట్టుబడికూడా పెట్టాము. అక్కడ వారు labour లేదంటున్నారు. మీరు ఎందరువస్తారో రండి, నేను భారతసేవక సమాజ్ వారికి చెప్పి అక్కడ కూడా మీకు పని కల్పిస్తాను అని చెప్పాను. కాని ఆ మిత్రుడు మళ్ళీ నన్ను కలువలేదు. ఇక seniority మొదలైనవి technical విషయాలు నాకు తెలియవు. కాని నేను ఇది ఒకటే చెప్పాను. వారు 2,3 సమస్యలు తీసుకువచ్చారు. మీరు technicalగా పోవాలంటే Factory Act క్రింద rule క్రిందమీకు ఏది ఏది అవసరమో ఏది ఏది కావాలనో మీకు legal గా రావలసివుంటుందో దానికి బాధ్యత నేను వహిస్తాను. కాని మీరు technical గా పోవద్దంటే gratuity grant చేయాలంటే అది రెండో విషయం. అదీకావాలి, యిదీకావాలిఅంటే రాదు. "Act వర్తించదు కనుక మాకు సహకారం చేయాల" న్నారు మళ్ళా "Act వర్తిస్తుంది కనుక హక్కులు కావాల"ని రెండూ చెప్పారు. వెంబడి వచ్చిన శాసనసభ్యులకే అది నచ్చలేదు. వారిపేరు కావాలంటే చెబుతాను, శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు వారు. "You connot have it both ways ఏదయినా ఒకటి clear cut గా చెప్పండి"అని వారు చెప్పారు. దాని తరువాత వారెవరూ నన్ను కలువలేదు. అక్కడ మాత్రంవారికి తగిన సదుపాయాలు కలిగించాము. వర్షంవుంటుందేమోనని లారీలకు top sheet వేయించి వారిని అందరినీ ఆ లారీలలో వైజాగ్ స్టేషన్ వరకు పంపించాము. అక్కడనుంచి ఎవరైనా రాదలస్తే వారికి సౌకర్యాలు కలిపించాలనే వుద్దేశ్యంతో ఈ ప్రచారం కూడా చేశాము. "నాగార్జున సాగర్ లో మీకు పని లభిస్తుంది" అని. ఇదే కాక కేంద్రప్రభుత్వానికి కూడా యీవిషయాలు తెలిపి వారందరికీ ఎక్క-

డయినా ఏ Project క్రిందయినా పనికల్పించగలిగితే బాగుంటుందని వారికి తెలియజేశాము. తరువాత శ్రీ సుబ్బారెడ్డిగారు మాట్లాడారు. వారికికూడా యీ department సక్రమంగా నడవాలనే వుద్దేశ్యంవుంది. వార్షిక యిన్నిలక్షల నష్టంవస్తున్నదన్న దానికిజవాబు చెప్పడానికిబదులు వారు, నేను—యీవిషయాలు తెలుసుకోదలచినవారందరూ— కూడా కూర్చుని పరిశీలించి యిందులోఏదయినా సత్యంవుంటే, 'iota of truth' వున్నా, దానివిషయమై తగుచర్య తీసుకొనడమే నాకర్తవ్యమని నేను అనుకుంటున్నాను. శ్రీ పరంధామయ్యగారు మాట్లాడుతూ 10% లెక్కను తగ్గించాలన్నారు. దానిని గురించి వారు Planning Commission Report నుంచికూడా చదివారు. కాని 10% మనకు recurring expenses కు సరిపోదు. సరిపోకున్నా ఏదో 10% అయినావుంటే కొంతవరకు మనంముందుకు పోగలుగుతాం అనుకున్నామేతప్ప వేరేమీకాదు. ముఖ్యంగా మనం Board వేరేస్థాపించిన తరువాత స్వయంపోషకత్వంగా యీసంస్థను నడపవలసివస్తుంది. 4% కు తగ్గిస్తే ముందు మనం యీ సంస్థను నిర్వహించగలుగుతామా లేదాఅనే అనుమానం కలుగుతుంది. కనుక అది సాధ్యంకాదనుకుంటాను. అయినప్పటికీ యితరప్రాంతాలలో ఏతీరుగానడుపుతున్నారో అది కూడా మనం తెలుసుకోగలిగితే చూస్తాం. మదరాసులో 10% నుంచి 18% వరకు పోతున్నారు. 18% అయినా staff కు యితర ఖర్చులకు అయ్యే వ్యయం భరింపజాలక, ప్రతి scheme మనం సక్రమ పద్ధతిలో నడపడానికి అవకాశం వుండదేమోనని Finance వారు వ్రాశారు. ఆవిషయం కూడా నేను ఆలోచిస్తాను. కాని యిక తగ్గించడం వీలుకాదు. అవసరంవుంటే యింకా కొంచెం హెచ్చించవలసివస్తుందేమో.

'ఎన్నో స్కీములను investigate చేశారు; 3, 4 సంవత్సరాల క్రితం కూడా చేసినారు; ఇది ఏమి అన్యాయం; పనిమాత్రం కావడంలేదు అని కొందరు అంటున్నారు. నూతన రాష్ట్రం రాగానే ఉత్సాహంతో పని చేయాలని అనుకున్నారు. సాధ్యమైనంతవరకు చేస్తూనే ఉన్నారుకూడా. అయితే investigation చేయడంవల్ల నష్టం ఏమిటి ? నేను కేంద్ర ప్రభుత్వంవారితో సంప్రదించినప్పుడు నా దగ్గర కొన్ని కోట్ల రూపాయిలు విలువగల స్కీములు మంజూరైనవి ఉన్నాయి; డబ్బులేదని చెప్పుకోడానికి అవకాశం చిక్కినదా, లేదా, చెప్పండి; సర్వేకూడా చేయకపోతే అలా చెప్పుకోడానికి కూడా అవకాశం లేదే! ఒక మంచి పని చేయదలచుకున్నాము; ఒక పెద్ద భవనం నిర్మించదలచుకున్నాము అనుకోండి. దానికొరకు చవుక ధరకు భూమి దొరికితే కొన్నాము. స్థలం ఎందుకు కొన్నావు; ఇల్లు ఎందుకు కట్టావు అంటే అర్థం ఉన్నదా? భూమికూడా కొనకుండా ఉంటే బాగుండేదా ? ఆరకమైన భావన తప్పు, ఇది మొదటి మెట్టు;

దానిని దాటాము; తరువాత ఆలోచిస్తాము; ప్రయత్నం చేస్తాము. మొదటి step మాత్రం ఎందుకు వేశారు. ఎందుకు సర్వే చేశారు అంటే ఎట్లా ? ప్రజలను మాత్రం మనము ఏమీ అనజాలము. గౌరవ సభ్యులు తెలుసుకోవాలి. ప్రజలకు నిర్మాణాత్మకంగా, ఆచరణాత్మకంగా శాసన సభ్యులందరూచెప్పగలగాలి. ప్రజలకు ఏమి తెలుస్తుంది ? ఇంతకాలమై సర్వే చేశారు; విద్యుచ్ఛక్తి రాలేదే; పని జరుగలేదే అనుకుంటారు. అలాఅనుకోటంలో తప్పులేదు. నేను ఈ మధ్య నెల్లూరు జిల్లా వెళ్ళినప్పుడు ఒక తమాషా జరిగింది. అక్కడ ఎవరో ప్రచారం చేసారట. ఇక్కడ అన్ని పనులు ఆగిపోయాయి; మంత్రి తెలంగాణావాడు కాట్టిబ సామగ్రి అంతా తెలంగాణాకు పోతున్నదని చెప్పినారట. ఎవరో ఎనిమిది మంది, పదిమంది ఏవో పిటిషన్లు తీసుకువస్తే నా మిత్రుడు శ్రీ కోదండ రామిరెడ్డిగారు వారితో మీకు ఏమీ తెలియదు ; ఇట్లాంటిపిటిషనులు ఇస్తే బాగుండదు; ఆయనకు తెలిస్తే నొచ్చుకుంటారనిచెప్పి వారిని పంపివేసితరువాత కూర్చున్నప్పుడు నాతో చెప్పారు ఇట్లా జరిగినదని. బడ్జెటులు వేరు; allocations వేరు; ఏవస్తువు తీసుకోవాలన్నా సాధ్యంకానిపని. అయినాయీ ప్రచారం జరుగుతున్నదని కూడా శాసన సభ్యుడు ఎవరో చెప్పారు. తెలంగాణా డబ్బు ఆంధ్రకు, ఆంధ్ర డబ్బు తెలంగాణాకు ఖర్చుచేయకుండా ఉండడానికే వేరువేరు బడ్జెటులు ఏర్పాటుచేశాము. తెలంగాణాలో అభివృద్ధి కార్యక్రమాలుతక్కువగా ఉన్నాయి. ఇక్కడతలసరి 5 యూనిట్లు అక్కడ 10 యూనిట్లు విద్యుచ్ఛక్తి ఉన్నదిక్కాబట్టి ఆంధ్రప్రాంతమువారు మా డబ్బు తీసుకుని వెళ్ళి 10 యూనిట్లు వచ్చేవరకు అభివృద్ధి చెందండి అనేవిధంగా చెప్పవలసినది మర్యాద. దానికి బదులు ఈరకంగా చెప్పడం బాగాలేదు. ఎక్కడో పని ఆగిపోయిందన్నా నేను కారకుణ్ణి, నేను నిందితుణ్ణి అన్నట్లు చెప్పడం న్యాయంకాదు. తెలంగాణా వారు కూడా కొంతమంది మిత్రులు మాట్లాడారు. ఏ కారణమో నేను చెప్పడానికి సాహసించను. ఏ కారణమైనా, సక్రమపద్ధతిలో పని జరగలేదని మొదట ఉపన్యాసంలోనే చెప్పాను. సాధ్యమైనంతవరకు చేయాలనే మా ఉద్దేశం. ఈ మధ్య నేను చార్జితీసుకున్న తరువాత క్రొత్తప్రభుత్వం వచ్చినతరువాత 9, 10 చోట్ల డీసెలు సెట్సుతోనే విద్యుచ్ఛక్తి ఇచ్చాము. ముఖ్యంగా రామగుండం పని పూర్తికావాలి; విదేశమారకం దొరకాలి. రామగుండం నుంచి సిర్‌పూర్ వరకు పని జరుగుతోంది. ఇప్పుడు బెల్లంపల్లి వరకు పని పూర్తిఅయినది. రంగనాథ రావుగారు మాట్లాడుతూ ఆదిలాబాదుజిల్లాకు ఏమీజరగడంలేదు అన్నారు. ఆదిలాబాద్‌లోనే కాదు, నిర్మల్‌లో కూడా ఈమధ్య డిసెల్ సెట్సుతో పవరు సప్లయి చేస్తున్నారు. రెండు మూడు మాసాలలో సిరిపురంవరకు పనిపూర్తి అయి connection వస్తే industrial load అక్కడ ఉంటుంది. బెల్లంపల్లి కాలరీస్‌కు సిరిపూర్ కాగితపు మిల్లుకు క్రొత్తగా మంచెరాలలోపెట్టే సిమెంటు ఫ్యాక్టరీకి పవరుసప్లై అవుతుంది. ఆపని ఒకటి రెండు మాసాలలో పూర్తిఅవు

తుంది. వరంగల్లువరకు వేసే మరొక లైనుమీద పని వర్షాకాలం అవడంచేత ఆగిపోయింది, అదికూడా తొందరగా పూర్తిఅయితే అక్కడనుంచి వరంగల్లు వరకు మిల్లులన్నింటికి మనం సరఫరా చేయగలుగుతాము. మూడవలైను సిద్ధిపేటవరకు వచ్చినది. దీనిని హైదరాబాదుతో కలిపితే తుంగభద్రనుంచి పవర్ వస్తే వీటినన్నింటిని గ్రేడ్ చేస్తే, నాయక్‌గారు కోరినట్లు, చవుకధరకు విద్యుచ్ఛక్తి సప్లయిచేసే అవకాశం రావచ్చును. అయితే ఎంతవరకు రేట్లు తగ్గించే అవకాశం ఉంటుందో ఇప్పుడే చెప్పడంకష్టం. ఇక్కడకూడా పూర్వం ఒక రేటుఉండేది, రెండు సంవత్సరాలక్రితం మరొక రేటు చేశారు, ఈ రెండు రేట్లలో ఏది బాగున్నదో విచారించడానికిఒక formal సంఘాన్ని వేయలేదు. కాని నావద్దకు కొందరు commercial firms వారువస్తే కొందరు ఉద్యోగులనుపిలిచి ప్రభుత్వాదాయం ఏరేటునుఅనుసరిస్తే పెరుగుతుందో ఆరేటును అనుసరించు దాము. ఎవరో capitalistsకు నష్టంవస్తుందని చూడవద్దు; వ్యవసాయదారులరేటు తగ్గించుదాము అని చెప్పినాను. ఆసూచనలు ఇక ముందు వచ్చిన తర్వాత ఆలో చిస్తాము. శ్రీ వాసుదేవనాయక్ గారు మాట్లాడుతూ మరొక విషయంచెప్పారు. కొన్ని డీసెల్ సెట్సుకు హైదరాబాదు ప్రభుత్వం ఆర్డరుఇచ్చినది. ఈ విషయమై ఛీఫ్ ఇంజనీరు తన అభిప్రాయాన్ని మార్చుకుని P.W.D.మంత్రిగారి అభిప్రాయా నికికూడా వ్యతిరేకంగా చేశారు; దీనికి కారణం ఏమని వారుఅడిగారు. దీనికి కారణం నేను కూడా పూర్తిగా చెప్పలేను. తెలిసినంతవరకు చెబుతాను. ఆ రోజు లలోCentral Stores purchase systemక్రింద ఆర్డరు ఇవ్వకముందు పరిశ్రమల మంత్రి అభిప్రాయాన్నికూడా తీసుకునేవారు; ఇరువురు మంత్రులకు అభిప్రాయ భేదం వస్తే శ్రీ రామకృష్ణరావుగారు తుది తీర్పు ఇచ్చిన తరువాత ఛీఫ్ ఇంజనీరుగారు దాని ప్రకారం ఆర్డరు ఇచ్చారు. ఇందులో డిపార్టుమెంటు తప్పు ఏమీలేదు. ఇక రేట్లు తగ్గింపు విషయం ఆలోచిస్తాము; ఎంతవరకు సాధ్యపడు తుందో చెప్పలేము.

శ్రీ వి. కె. నాయక్ : 6% నుంచి 4½% కు చేయగలరా ?

శ్రీ జె. వి. నరసింగరావు : ఆంధ్రలో అమలులో ఉన్న రేట్లను ఇక్కడ ఉన్న రేట్లను సమీకరణ (integrate) చేసి Common tariff చేయాలనే ఉద్దేశం ఉన్నది. ఇక్కడ హైడ్రో ఎలక్ట్రిక్ పవరు లేని కారణంవల్ల ఇపుడు తగ్గించడం సాధ్యంకాదు. తుంగభద్రనుంచి పవరు వచ్చిన తరువాత సాధ్యపడుతుందేమో నిపుణులు పరిశీలించాలి. ఇపుడే నేను చెప్పడం కష్టం. పేట బాపయ్యగారు కొన్ని స్కీములు విషయం చెప్పారు. కనిగిరి వరకు డీసెల్ సెట్సుతోనే విద్యు చ్ఛక్తి సప్లయి చేస్తున్నారు. ఇతర చోట్లకు ఎంతవరకు సప్లయిచేయగలమనే విషయం ఆలోచనలో ఉన్నది. ఇది పునాది విషయం— కేంద్రంలో మనంచేసే

ప్రయత్నాలు లాభించి కొంత డబ్బు చేతికివస్తే ఏదైనా ఆలోచించవచ్చును. నాకు ఒకఅభిప్రాయం ఉన్నది. జిల్లాలవారీగా శాసనసభ్యులను కూర్చుండబెట్టి ఏ స్కీముకు priority ఇవ్వాలో, దేనికి అక్కరలేదో నిర్ణయించుకుందాము; ఆ రకంగా కార్యక్రమం వేసుకుని అవసరమైన స్కీములు అమలుచేద్దాము. తెలంగాణాలో అంటే ఇంకాకష్టంకాని ఆంధ్రలో స్కీములన్నీ సర్వేఅయి ఎస్టిమేట్లు కూడా తయారై ఉండడంవల్ల అమలుచేయడం చాలా సులభం. శ్రీ బసవమానెయ్యగారు అక్కడ ఉపన్యాసము ఇచ్చారు; తదుపరి ఇక్కడికివచ్చి అప్లికేషన్ ఇచ్చారు, ఇంతకుముందు నన్ను కలువలేదు, కావాలని కోరలేదు, ఇప్పుడైనా కావాలని కోరినారు; చాలా సంతోషం, నాలుగు సంవత్సరాల విషయం నేను మాట్లాడడంలేదు, వారు ఈ సభాసభ్యులుగా ఉన్నప్పటినుంచే నేను కూడా సభ్యుణ్ణిగా ఉంటున్నాను. కొన్ని విషయాలు మనకు కావాలంటే ప్రయత్నం చేయాలి; కానిపరిస్థితులేమైనా ఉంటే మనవిచేస్తాను. గౌరవసభ్యులు నా దగ్గరకు రావచ్చును; కలువవచ్చును; చెప్పవచ్చును. ఈ సంవత్సరం ఆంధ్రప్రాంతంలో rural electrification క్రింద 74 లక్షలుంటే తెలంగాణాకు 78 లక్షలున్నాయి. మొత్తంలో సగంకంటే ఎక్కువ. తెలంగాణాలో 78 లక్షలను ఖర్చుచేసి చురుకుగా పనిచేయడానికి ఒక సూపరింటెండింగ్ ఇంజనీరును వేసినాము. ఈ సంవత్సరం తెలంగాణాలోని అన్ని స్కీములను పూర్తిచేస్తే దాదాపు 5 యూనిట్లనుంచి 8 యూనిట్ల వరకు పెరుగవచ్చును. 300 గ్రామాలకు ఆంధ్ర, తెలంగాణాలలో కలిపి ఈ క్లిష్ట పరిస్థితులలో కూడా సప్లై ఇవ్వాలని అనుకున్నాము. మొదటనే చెప్పినట్లు ఒక్క సంవత్సరంలో తాలూకా ముఖ్యపట్టణాలలో అయినా స్కీములుపూర్తిచేయాలనిఅనుకున్నాము. తాలూకా ముఖ్యపట్టణాలలో పెట్టాలనుకున్నామంటే అక్కడ ఎవరో ప్రభుత్వోద్యోగి ఉంటాడు. అతనిని సంతోషపెట్టాలని కాదు. Electricity consciousness కావాలి. గ్రామాలనుంచి తాలూకా ముఖ్యపట్టణానికి చాలా మంది వస్తారు. విద్యుచ్ఛక్తి ఉన్నదని చూస్తారు. ఒక క్రొత్త నవతేజస్సు కలుగుతుంది. ఇది అంతా ఒక విధమైన నర్సరీ స్కీము మోస్తరు అనుకోండి. మొదట ఆ రకంగా ప్రారంభించి తరువాత గ్రామాలకు ఇవ్వవచ్చును. సాధ్యమైనంత వరకు ప్రయత్నం చేస్తున్నాము. విదేశమారకం పైన యంత్రాలు దొరకడంపైన ఆధారపడి ఉన్నది. అయితే అన్ని తాలూకా కేంద్రాలలో విద్యుచ్ఛక్తి యీ సంవత్సరంలో ఇవ్వాలనే నిర్ణయం తీసుకున్నాము. ఇక ముఖ్యవిషయాలు ఏమీలేవు. మరొకసారి సభ్యులందరు చాలామంచి సలహాలు ఇచ్చారు.

శ్రీ బి. ధర్మభిక్షం: నల్గొండ జిల్లాగురించి cut motions వచ్చాయి. కాని ఏమి జవాబు ఇవ్వలేదు.

శ్రీ జె. వి. నరశింగరావు : తెలంగాణా విషయాలు చెప్పాను. కాని నల్గొండ గురించి ప్రత్యేకంగా చెబుతాను. నాగార్జున సాగరం వచ్చింది కనుక నల్గొండ జిల్లాకు విద్యుచ్ఛక్తి వస్తుంది. నల్గొండకు, భువనగిరికి ఈ మధ్యే విద్యుచ్ఛక్తి సరఫరా చేశాము. ఇతర గ్రామాలకు పథకాలు తయారుకాలేదు. తెలంగాణాలో మనం చేసే కార్యక్రమాలు సాధ్యమైనంతవరకు ఎక్కువ ప్రాజెక్టులు లేని, నీటి వసతులులేని చోట్లనే చేద్దామనుకున్నాం. నల్గొండజిల్లా దానిక్రిందకు వస్తుందో రాదో !

శ్రీ బి. ధర్మభిక్షం : మాచ్ ఖండ్ పథకంయొక్క extension విషయం నేను మనవిచేశాను.

మిస్టర్ స్పీకర్ : గౌరవ సభ్యులు సమాధానం ఇవ్వకండి. ఎవరు ఏమీ అడగకూడదు వారి ఉపన్యాసం పూర్తిచేసేవరకు.

శ్రీ జె. వి. నరశింగరావు : మాచ్ ఖండ్ విషయం నిర్ణయము కాలేదు. కాని మాచ్ ఖండ్‌ను హైదరాబాదులో link-up చేయాలని ఆలోచిస్తున్నాము. అది నల్గొండమీదుగా వస్తుందా, లేక నాగార్జునసాగరంనుండి నేరుగా వస్తుందా, లేక నల్గొండకు ఎంతవరకు కనెక్షన్ కలువగలుగుతామో నేను చెప్పేపరిస్థితిలో లేను. వారు కొన్ని సూచనలు చేశారు. అవన్నీ ఇప్పుడు నేను నోట్ చేసుకొన్నాను. సాధ్యమైనంతవరకు ఎంతవరకు ఆచరణయోగ్యమైనవో చూచుకొని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నం చేస్తాము. ఈవిషయాలన్నీ తెలిసినతరువాత అభిప్రాయభేదాలు వుండకూడదు. కనుక అందరు ఏకగ్రీవంగా ఈ డిమాండును ఆమోదిస్తారని భావిస్తున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అధ్యక్షా! ఆంధ్రా గవర్నమెంటు ఎలక్ట్రిసిటీబోర్డు అక్కరలేదని నిర్ణయించుకొన్నది. ఇప్పుడు ఎలక్ట్రిసిటీబోర్డు ఏర్పరుస్తామని మంత్రిగారు చెప్పారు. ఎలక్ట్రిసిటీ బోర్డు అక్కరలేదనే మా అభిప్రాయం. ఆవిషయంలో ప్రభుత్వం ఏమిసూచిస్తుందనిఅడుగుతున్నాను.

శ్రీ జె. వి. నరశింగరావు : ఈ ఎలక్ట్రిసిటీ బోర్డులవిషయంలో మద్రాసు, మైసూరు, ఆంధ్ర అన్నీకూడా కేంద్రప్రభుత్వానికి మనవిచేస్తునేవచ్చాయి. ఇంకా ఇక్కడ అభివృద్ధి కాలేదు. కనుక Boards కు అధికారాలు అప్పజెప్పితే పని సక్రమంగా అవుతుందో లేదో? కనుక కొన్నిసంవత్సరాలు మమ్ము exempt చేస్తే బాగుంటుందనే ప్రయత్నం జరిగింది. తుదకు ఆరుమాసాలక్రితం ముఖ్యమంత్రులందరు అక్కడ సమావేశమైనప్పుడు ఒప్పుకొనివచ్చారు. మైసూరులో ప్రారంభించారు. ఇంకా వివరాలు తెలియలేదు కాని పేపర్లో చదివాను. మద్రాసులోకూడా

ప్రారంభించారని. నేనుమాత్రం సెప్టెంబరువరకు గడువు తీసికొన్నాను. మళ్లా మొన్న వచ్చినపుడు వారితోవిచారించగా డిసెంబరువరకు గడువిస్తామని చెప్పారు. దానికికారణంఏమంటే, యింకా స్టేటుసర్వీసులు ఇంటిగ్రేటుకాలేదు. గ్రేడ్సు వేరుగావున్నాయి. ఇంకా ఎన్నోవిషయాలు వున్నాయి. సర్వీసును వాళ్ళకు ఒప్పచెప్పాలా? లేదా? ఏపని ఏరీతిగా జరగాలి అనేది మనం సమగ్రంగా ఆలోచించుకొనేటంతవరకు బోర్డు లేకుండావుంటే బాగావుంటుంది. ఆచట్టం దేశంఅంతా అమలులోనికి వచ్చినపుడు, మనకు బోర్డురాకుండా వుండాలంటే అది సాధ్యంకాదు. నేనుకూడా అందరితో ఏకీభవించేవాడినే. కాని ఈ పరిస్థితులలో బోర్డు స్థాపించటం అవసరం అవుతుంది.

*Mr. Speaker :* The question is:

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(గ్రామసీమలకు వేస్తామనిచెప్పిన లైనులు త్వరగా వేసి, విద్యుచ్ఛక్తి సంవత్సరాలకొలది సరఫరా చేయకుండా పోతున్నందులకు.)

The motion was negatived.

*Mr. Speaker* : The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Re. 1

(To criticise Government's failure to publish the Report of the Committee appointed to enquire into the loss of Rs. 40 lakhs worth of Elec. material in Andhra Area.)

The motion was negatived.

*Sri B. Sreeramamurthy :* I demand a division Sir.

The House then divided.

Ayes—28 ; Noes—65

The motion was negatived.

*Mr. Speaker* . The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To know at what stage the domestic and street lighting stands in Narnepadu village in Phirangipuram-Guntur line.)

The motion was negatived.

*Mr. Speaker* : The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(పొదిలి, దర్శి, కనిగిరి, ఉదయగిరి, తాలూకాలలో వ్యవసాయం బావుల క్రింద జరుగుతుంది. కేవలం వర్షంమీదనే వ్యవసాయం ఆధారపడివుంది. అలాంటప్పుడు ఒంగోలు తాలూకా చీమకుర్తివరకువచ్చిన విద్యుచ్ఛక్తి యీ మెట్ట ప్రాంతాలకు అందచేయుటకు జరుగుతున్న జాప్యాన్ని గురించి చర్చించుటకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(కొత్తగూడెంనుంచి ఖమ్మం పట్టణమునకు విద్యుచ్ఛక్తిని అందించడం విషయంలో జరుపబడుచున్న కాలయాపనను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To impress upon the Govt. to retain the workers in Machkund Elec. Schemes including Jalaput who were given notice of.)

The motion was negatived.

*Sri Vavilala Gopalakrishnayya*: I demand a division, Sir.

The House then divided.
Ayes 29; Noes 65.

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(నల్లగొండ జిల్లాకు విద్యుచ్ఛక్తి సప్లయి గురించి)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To discuss the policy)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

"To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(కూనవరంలో విద్యుచ్ఛక్తి పెట్టమని ప్రజలు చాలా కాలంగా కోరుతున్నప్పటికి పెట్టకుండా ఉన్నందులకు)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(నల్లగొండ జిల్లాలోని సూర్యాపేట, మిర్యాలగూడెం మొదలగు తాలూకా కేంద్రాలలో విద్యుచ్ఛక్తి ఏర్పాట్లు చేయకపోవటం గురించి)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electrictiy by Rs 100

(ముధోల్ తాలూకాలో భైంసాలో విద్యుచ్ఛక్తి పెట్టనందుకు)

The motion was negatived.

*Mr. Speaker* : The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Re. 1

(To criticise policy.)

The motion was negatived.

*Mr. Speaker* : The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Eelectricity by Rs. 100

(To criticise the policy of Government in giving notice of termination of service to the workers in Jalaput and Machkund works when the case was pending with the Tribunal).

The motion was negatived.

*Mr. Speaker* : The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To know at what stage the extension of Electricity stands for Lakkaraju Garlapadu villages on Phirangipuram Narsaraopet line.)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To know what was the cause for burning of the Power House at Macherla.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To discuss the failure to complete the Ramagundam Therma Scheme in time.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(వెంకటాపురం తాలూకాలోని చెర్లగ్రామంలో విద్యుచ్ఛక్తి పెట్టి వ్యవసాయమును అభివృద్ధి చేయనందుకు)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(విద్యుశ్ఛక్తిని కనిగిరిలో నెల్లూరుజిల్లా వ్యవసాయమునకు కూడా యిచ్చుటకుగాను)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(మాచ్ ఖండు విద్యుచ్ఛక్తిని నెల్లూరుజిల్లా కదిరి, పొదిలి, దర్శి తాలూకాలకు సప్లయి చేయుటకు గాను.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To discuss the problem of power supply to the towns of Sircilla, Vemulawada.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 2,56,13,400
for Electricity by Rs. 100

(To discuss the problem of the power supply from Ramagundam Thermal Power Station to the nearer district of Karimnagar villages.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

" That the Government be granted a sum not exceeding Rs. 2,56,13,400 under Demand No. XXVII - Electricity.

The motion was adopted.

*DEMAND NO. XLIII — Capital Outlay on Electricity Schemes — Rs.* 10,78,00,600

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 10,78,00,600 for Capital Outlay on Electricity Schemes by Rs. 100

(To undertake the construction of Power Scheme on Kaileru this year.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

"That the Government be granted a sum not exceeding Rs. 10,78,00,600 under Demand No. XLIII - Capital Outlay on Electricity Schemes."

The motion was adopted.

*Mr. Speaker:* The House now stands adjourned till 8-30 A.M. on Tuesday the 23rd July, 1957.

*The House then adjourned till Half Past Eight of the Clock on Tuesday, the 23rd July* 1957.

